శ్రీ రామాయనమః

# శ్రీ భాగవత మహాత్మ్యము

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

## వాసుదాస స్వామి



# శ్రీ భాగవత మాహాత్మ్యము



శ్రీ భక్తి సంజీవని సముద్ధృతము
దానశేష ప్రకాశితము

ప్రకాశకులు :

శ్రీ రామసేవా కుటీరము, వాల్మీకి ఆశ్రమము (శృంగిశైలము),
ఒంటిమిట్ట, కడప జిల్లా.

శ్రీరామసేవ

# మనవి

శ్రీ భాగవతమాహాత్మ్యము పద్మపురాణమందు స్కాంధపురాణమందు సంస్కృత భాషయందుఁ గలదు. తెలుఁగునఁ బద్యకావ్యముగఁగూడ రచింపఁబడిన దని వినుకలి. వచనమున దేటతెనుఁగున నెల్లరకుఁ దెలియులాగున శ్రీభక్తిసంజీవనియందుఁ బ్రకటింపఁబడినది. శ్రీ భాగవతమాహాత్మ్యమును జక్కఁగాఁదెలిపి పరమహంససంహితయగు శ్రీభాగవత మధ్యయనముచేసి శాశ్వత శాంతినిధానమగు భగవత్సన్నిధాన మహాభాగ్యమును జూఱగొనెదరుగాత!

ఇట్లు విన్నవించు
దాసశేషుఁడు

# రెండవ కూర్పు పీఠిక

పద్మపురాణము, స్కాంధ పురాణములందుగల శ్రీభాగవత మాహాత్మ్యమును సరళమైనశైలిలో వచన రూపమున తెనుఁగున వ్రాసి శ్రీశ్రీ దాసశేష స్వామివారు యందఱు చదివి ఆనందించుటకు 1952 లో ముద్రించి యున్నారు.

శ్రీ సీతారాముల, శ్రీ గురుదేవుల యాశీర్వచనబలమున ఈ పొత్తము రెండవతూరి ముద్రణ మయినది. పాఠక లోకము దినినిఁ బఠించి భగవత్కృపకుఁ బాత్రులగుదురుగాక.

దాసకుటి అంగలకుదురు
పరీధావి కార్తీక
శు॥ 3 లు

# వినతి

గీ. శ్రీ యశోదాకిశోరంబుఁజేరి మ్రొక్కి
మందప్రోయాంద్ర పదధూళి మౌళిఁ దాల్చి.
బాదరాయణ నారద పరమమునుల,
భక్తి సేవించి, శుకదేవుఁ బ్రణతిసల్పి,
ధన్యు మద్గురు శ్రీ వాసుదాసుఁ దలచి,
భాగవతమహిమ తెనుఁగు బాస నెలమి,
నసువదించెద నాలింపుఁ డాదరమున,
భక్తజనులార ! సాధుప్రపన్నులార !
తల్లులార ! ప్రేమలతామతల్లులార ! !

ఈ భాగవతమాహాత్మ్యము పద్మపురాణాంతర్గతము. శ్రీ శుకశాస్త్రమగు శ్రీమద్భాగవతముయొక్క మాహాత్మ్యము గీర్వాణ భాషయందుఁ గలదు. పండితకవులు దీనిని దెనుఁగునఁ బద్యరూపమున రచించియున్నారు. కాని తెలుఁగున తేటమాటలతో నుండిన నెల్లర కందుబాటులో నుండగలదని నమ్మి సాహసించి ఈ పనికిఁ బూనితిని విజ్ఞులు మన్నించెదరుగాక. విషయమును మాత్రము గ్రహించి శ్రీకృష్ణ భగవానుని ప్రతి రూపమగు శ్రీ భాగవతమును బఠించియో వినియో భగవత్కృపకుఁ బాత్రులగుటయే దేహధారులకు జన్మమొత్తినందుకు ఫలము. కుత్సితకథలకుఁ జెవియొగ్గి, కుపథములఁబడి తల్లి గర్భవేదనకు మాత్రమే తాము కారణభూతులగుట బుద్ధిమంతులకు లక్షణము కాదు. కావున సాధువులఁ జేరి వారి సద్బోధనలను మనస్సునఁ బట్టించుకొని మననము చేసి భగవత్కృపకుఁ బాత్రులయి పరమ శాంతిసౌఖ్యములఁ బడసి జన్మసాఫల్యతకుఁ బ్రయత్నించెదము గాక –

ఇట్లు విన్నవించు
దాసశేషుఁడు

శ్రీ కృష్ణశ్శరణంమమ

# శ్రీమద్భాగవతమాహాత్మ్యము

## ప్రథమాధ్యాయము

**దేవర్షి నారదులు భక్తినిఁ జూచుట :-**

సమస్తజగముల సృష్టి, స్థితి వినాశములకు హేతువయి ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతిక తాపములకు ధూమకేతువయి భక్తజనజీవాతువై సచ్చిదానంద మూర్తియైన భగవంతుఁడగు శ్రీకృష్ణునకు నమస్కరించెద.

శ్రీశుకదేవుఁడు, యజ్ఞోపవీత సంస్కారమయినను గాలేదు; లైకిక వైదిక కర్మముల ననుష్ఠించుట కవసరమ యినను రాలేదు; అట్టి పసితనముననే యొంటిగానే సన్న్యాసమును గ్రహించు నుద్దేశముతో నాశ్రమమునుండి వెడలిపోయెను. అట్టి పరమభాగవతుఁడగు బుత్రుఁడు బాల్యావస్థయందే సన్న్యాసి యగుటచూచి, వానితండ్రియగు వ్యాసభగవానుడుఁ మిగులవగలఁ బొగిలి, విరహకాతరుడయి 'కొడకా ! కొడకా !' నీ వెందుఁబోయెదవురా' యని పిలుచుచు వెంటఁజనుచుండెను. ఆ సమయమున శ్రీశుకమహర్షిపక్షమున వృక్షములుం బ్రతి ధ్వనులు చక్కరజేసె నట్టి భూతమయునకు మ్రొక్కెదను.

ఒక సమయమున భాగవత కథామృతరసాస్వాదనకుశలుఁ డగుశౌనకమునివరుఁడు నైమిశారణ్యమున విరాజమానుఁ డయియున్న మహామతియగు శ్రీసూతమహర్షినిఁగాంచి యిట్లని యడిగెను.

**శౌనకుఁడు :-** సూతా! ధీనమేతా ! మీజ్ఞానము. అజ్ఞానాంధ కారమును బోఁగొట్టుటయందుఁ గోటిసూర్యులకు సాటి. ఈ సమయమున మావీనుల కమృతమువలెనుండి, సారగర్భితమయిన కథను దేనినయినఁ జెప్పుము. భక్తి, జ్ఞాన వైరాగ్యములచేఁ బొడమిన వివేకము దేనివలన వృద్ధిపొందునో, వైష్ణవులేవిధమున నీమాయామోహమును వెనుకకుఁ ద్రోవఁగలరో. యట్టి దానిని గృపతోఁదెలుపుము. ఈ ఘోరమగు కలికాలమున జీవులు తఱుచు ఆసురీస్వభావము కలిగియుందురు. అకారణమున వివత్పరంపరలో మునిఁగితేలుచుందురు. కావున నట్టి యాసురీస్వభావమును చక్కఁబఱిచి జీవులఁబావనులఁజేయఁ గల సర్వశ్రేష్ఠమగు నుపాయమేది? మాకిప్పుడన్నిఁటికంటె నధికకల్యాణమును గలిగించునదియు, నంతఃకరణమును బవిత్రముచేయునదియు, శాశ్వతముగ భగవంతుఁడగు శ్రీకృష్ణునిఁ బ్రాపింపఁ జేయునదియునగు సాధనమేదియో దానిని దెలుపుము. చింతామణి కేవల లౌకిక సుఖమునే యొసఁగ జాలును. కల్ప వృక్ష మధికములో నధికము స్వర్గభోగముల నీయఁగలదు. కాని గురుదేవుఁడు ప్రసన్నుఁడయినచో భగవంతుని శ్రీవైకుంఠధామమునే ప్రసాదింపఁ గలుగును. అది యోగిజనుల కయినను నెంతో కష్టముమీఁద లభించునందురు. కావునఁ దమ కృప యుండిన మాకుఁబడయ రానిదేమున్నది?

**సూతుఁడు :-** శౌనకమునిపుంగవా ! మీ హృదయమునందు భగవంతునియెడఁ బ్రేమ కలదు. కావున నేను యాలోచన మొనరించి, మీకు సమస్త సిద్ధాంతములలో దేలిన నిగ్గును వచించెద. జన్మ మరణ భయమును బావునట్టియు, భక్తి ప్రవాహమును బ్రబలఁ జేయునట్టియు, శ్రీకృష్ణభగవానుని ప్రసన్న తకుఁ బ్రధానకారణ మయినట్టియు, సాధనకు మీకుఁ దెలిపెదను. మీరు దానిని సావధాను రయి వినుఁడు. సకలజీవులు కాలరూపక రాళ వ్యాళముఖమునఁబడునవే. జీవున కన్నిఁటి కంటెఁ దప్పించుకొనవలనుపడని గొప్పగండ మిదియే. దీనిని దప్పించుకొని బయటఁబడిననేకాని మఱి యే యుపాయము చేతను శాంతి లభింపఁజాలదు. ఈ భయమును దూరమొనరించుటకే కలియుగమందు శ్రీశుకదేవులవారు శ్రీమద్భాగవతమను నొక శాస్త్రమును జెప్పెను. మనశ్శుద్ధి కింతకుమించిన గొప్పసాధనము మఱేదియులేదు. జన్మజన్మాంతరములందు సమార్జించిన పుణ్యము పండినఁగాని భాగవత శాస్త్రములందు సమార్జించిన పుణ్యము పండినఁగాని భాగవతశాస్త్రప్రాప్తి కలుగదు. చూడుఁడు. శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజున కీ కథ వినిపించుటకై సభలో వేంచేసియుండినప్పుడు, దేవత లమృత కలశమునుగొని యక్కడకు వచ్చిరి. వారు తమ పని నెగ్గించుకొనుటలో మిగులఁజతురులు. వడువు తెలిసిన బేరగాండ్రు. కావున నిందును, వారెల్లరు శ్రీశుకులను సమీపించి నమస్కరించి మీరీ యమృతమును స్వీకరించి దానికి బదులు మాకుఁ గథామృతమును నొసఁగుడు. మీకీబేరము వచ్చిన యెడల, నీ యమృతమును ద్రావి పరీక్షిన్మహారాజు అమరుఁడు కాఁగలఁడు. మేమో కథామృతమును బానము చేసెద" మని యడిగిరి. అప్పుడు శ్రీశుకభగవానుఁడు తన మననమున "లోకమున నమృతమేడ? హరికథ యేడ? గాజుపెంకేడ? అమూల్యమగు మణియేడ"? యని యోజించి, దేవతలాడిన మాటలనువిని నవ్వి, వీరు బేరమాడువారు. ఈతగింజవేసి త్రాటిగింజలాగువారే కాని భక్తి శూన్యులని యెఱిఁగి, కథామృతపానమున

వారికిఁ బాలొసంగ నిష్టపడలేదు. శ్రీమద్భాగవతకథ దేవతలకును దుర్లభమని దీనివలన నేర్పడుచున్నది.

శౌనకమునీంద్రా ! శ్రీమద్భాగవతకథను వినుటచేతనే శ్రీపరీక్షిన్మహారాజు ముక్తుఁడగుట చూచి, తొల్లి నలువయు మిగుల నచ్చెరువు చెందెను. అంత నా బ్రహ్మ సత్యలోకమున నొక తరాజునందు సర్వసాధనములను దూఁచెను ఆసాధనము లన్నియుఁ దేలిక యయ్యెను. తన మహత్త్వము కారణమున భాగవతమే యన్నిటికంటె బరువు తూఁగెను. ఇది చూచి ఋషులందఱు పరమ విస్మయమును జెంది, భగవద్రూప మయిన శ్రీమద్భాగవతశాస్త్రము పఠించుటచేతను, వినుటచేతను నీ కలికాలమునఁ దత్క్షణము మోక్షము నిచ్చునని నిశ్చయము చేసిరి. సప్తాహపారాయణ విధిచే దీనిని శ్రవణము చేసినచో నిశ్చయముగ నిది ముక్తిప్రదానము చేయును. పూర్వకాలమున దీనిని సనకాదులు దేవర్షియగు శ్రీ నారదభగవానునకు వినిపించిరి. శ్రీనారదభగవానులు మొట్టమొదట దీనిని బ్రహ్మగారివలన వినియుండెను. కాని సప్తాహపారాయణ విధానమునుమాత్రము సనకాదులే నారదభగవానునకు విశదముగఁ దెలియఁజేసిరి.

**శౌనకుఁడు :–** సూతా ! దేవర్షియగు నారదులవారు సంసారపుజంజాట మొక్కింతయు లేనివారుకదా. ఒకచోటఁ గాలుకుదిరి నిలుకడగా నుండువారు కారే? అట్టివారి కీ ప్రకారము సప్తాహవిధి ననుసరించి భాగవతము వినుటయం దెట్లు ప్రేమ కలిగెను? సనకాదులతో వారికి సమాగమ మెక్కడ కలిగినది?

**సూతుఁడు :–** మంచిది. ఇప్పుడు నేను మీకాభక్తిపూర్ణమగు కథానకమును వినిపించెదను. శ్రీశుకులవారు నన్నుఁ దనకనన్యభక్తిగల శిష్యునిగా స్వీకరించి యేకాంతమున దీని నుపదేశించిరి. ఒకసారి విశుద్ధాంతఃకరణులగు మునివరేణ్యులయిన సనకాదులు నల్వురును సత్సంగమునకయిబదరికావనంబు నందలి విశాల పురి కేగిరి. నారదుఁడును దీనపదనుఁడై వడివడిగాఁ బోవు చుండఁ జూచి, సనకాదులు నారదునితో 'బ్రాహ్మణశ్రేష్ఠా ! నీ వదనమేల విన్ననై యున్నది? నీ వేల చింతాగ్రస్తుఁడవైతివి? ఇంత వడివడిగా నెక్కడకుఁ బోయెదవు? ఎక్కడనుండి వచ్చుచున్నావు? సర్వస్వము కోలుపోయిన వానివలె నుదాసీనుఁడయి కానిపించెదవు. నీ వంటి విరక్తులగు పురుషుల కిట్టిదశ రారాదే? కృపయుంచి దీనికిఁ గారణమును దెలుపుము? అని యడిగిరి. ఆ మాటలను విని,

**నారదుఁడు :–** మహాత్ములారా ! మనుష్యులుండు లోకము కర్మభూమి; కావున నది సర్వశ్రేష్ఠమయినదని తలఁచి యచటకుఁ బోయితిని, అందుఁ బుష్కరము, ప్రయాగ, కాశి, గోదావరి (నాసిక), హరిద్వారము, కురుక్షేత్రము, శ్రీరంగము, సేతు బంధము మున్నగుతీర్థములు కలవు. నేను వాని నన్నిటి పలుమఱు సేవించితిని. కాని నాకెందును మనస్సునకు సంతోష జనకమగు శాంతి రవంతయు లభించినది కాదు. ఈ సమయమున నధర్మమునకు సహాయకముగ ఘోరమగు కలి పుడమినంతయుఁ బీడించు చున్నది. ఇప్పు డందు సత్యము, తపము, శౌచము, దయ, దానము మున్నగునవి యపరూపము లయ్యెను. పాపము ! జీవులు కేవలము పొట్టపోసికొనుటయే ముఖ్య పురుషార్థముగఁ దలపోసి యందే మునిఁగియున్నారు. వారసత్యములాడువారు, అలసులు, మందబుద్ధులు, భాగ్యహీనులయి యున్నారు. వారిని వింత వింతలగు విపత్తు లలముకొనినవి. సాధుసంతలనెడివారు పూర్ణముగఁ బాషండులయిరి. పైకిఁ జూచుటకేమో విరక్తుల వలెఁ గానఁబడెదరు. కానివారు కామినీకాంచనాదుల నన్నిటిని బరిగ్రహించెదరు. గృహములందో యాఁడు వారిదేరాజ్యము. స్యాలకుఁడే యాలోచన చెప్పువాఁడు – కాసులమీఁది పేరాసచే బాపము ! యభము శుభమెఱుఁగని యాఁడుపడుచులు విక్రయింపఁబడుచున్నారు – ఆలుమగలకు నిత్యము జగడము జరగుచున్నది. మహాత్ముల యాశ్రమములు, తీర్థములు, నదులు మున్నగు వానిమీఁద విధర్ముల యధికారము ప్రబలినది – ఆదుష్టులనేక దేవాలయముల నాశముచేసిరి – ఇప్పుడందు యోగిలేఁడు' జ్ఞానిలేఁడు, సత్కర్మము లొనరించువాఁడును లేఁడు. సర్వసాధనములు కలియనెడి కార్చిచ్చుచే మండి, భస్మమైపోయినవి – ఈ కలియుగమునందు వాడవాడను నంగడులలో నన్న మమ్మఁ జాగిరి. విప్రులు కాసుల కాసపడి, వేదమును జదివించుచున్నారు; పడఁతులు పడుపుకూటికి లోపడి పడరాని బదవలు పడుచున్నారు.

ఈ విధముగా కలియుగమునందలి దోషములను దిలకించుచుఁ బుడమిమీఁదఁ దిరిగి తిరిగి యమునానది యొడ్డునకు వచ్చి చేరితిని. ఆ ప్రదేశమున శ్రీకృష్ణభగవానుఁ డనేకలీలలు గావించి యుండెను. మునివరులారా ! వినుఁడు. అక్కడ నే నొక మహాశ్చర్యమును గంటిని. ఆ సమయమున నొక యువతి మిగులఖిన్న చిత్తయయి యచటఁ గూరుచుండి యుండెను. ఆమె సమీపమున నిరువురు పురుషు లొడలెఱుఁగక పడియుండి వడి వడిగ నూర్పులు వుచ్చుచుండిరి. ఆతరుణివారల కుపచార మొనరించు చుండెను. ఒకప్పుడు వారికి స్మారకము గలిగించుటకుఁ బ్రయత్నించుచుండెను. ఒకప్పుడు వారిముందేడ్చుచుండెను. మధ్యమధ్య నామె దశదిశలు పరికించుచుఁ దనసురక్షించు పురుషుఁ డెవ్వఁడయిన వచ్చునాయని నిరీక్షించుచుండెను.

ఆమె చుట్టును నిలిచి నూర్లకొలఁది స్త్రీలు వీవనలతో నామెకు విసరుచు, మాటిమాటి కామె నోదార్చుచుండిరి. దూరమునుండి యాచరిత్ర మంతయుఁజూచి, కుతూహలవశుఁడనయి యామె కడకుఁ బోతిని. నన్నుఁజూచి యాయువతి లేచినిలఁబడి, మిగుల వ్యాకులముతో 'మహాత్మా ! ఒక క్షణము సేఁపు నిలిచి, నాగోడు వినుము – మీదర్శనము, సంసారమందలి పాపతాపముల నెల్ల సర్వవిధముల రూపుమాపునట్టిది – మీ శ్రీ సూక్తుల మూలమున నాదుఃఖములోఁ గొంత కొంత శాంతింపఁగలదు. మానవుఁ డెంతో భాగ్యముచేసిననే మీదర్శనము లభింపగలదు' అని దీనయై పలుక, నప్పుడు, నేనామె నిట్లని యడిగితిని. 'దేవీ ! నీవెవతవు ? – ఈ పురుషులిరువురు నీ కేమయ్యెదను? నీ సన్నిధి లోనున్న యీకమలనయన లెవ్వరు? నాకుసవిస్తరముగ నీదుఃఖ కారణమును దెలుపుము.'

**యువతి :–** స్వామీ ! నాపేరు భక్తి యందురు. వీరు జ్ఞాన, వైరాగ్యనామకులు; నాపుత్రులు; కాలము తాఱుమాఱయి వీరిట్లు ముసలివగ్గులయి స్మృతితప్పి పడియున్నారు. ఈ నారీమణులు గంగాదినదులు – వీరందఱు నాసేవ చేయవచ్చిరి. సాక్షాత్తు వీరీప్రకార మెంత యుపచరించినను నాకు రవంత యయిన సుఖముగా లేదు. తపోధనా ! కొంచెము మనసుంచి నావృత్తాంతము వినుము. నాకథ చేఁటభారతము. దాని నోపికతో విని నాకొకింత శాంతిని సమకూర్చుము.

నేను ద్రవిడ దేశమునఁబుట్టి, కర్ణాటకమునఁ బెరిఁగి పెద్దదాననైతిని. మహారాష్ట్రమున నాకందందు మంచి మన్నన కలిగినది కాని ఘూర్జరమున (గుజరాతు) లో నాకు వార్ధక్యము దాపరించినది. అక్కడ ఘోరమగు కలిప్రభావమునఁ బాషండులు నాకు అంగభంగము కలిగించిరి. అప్పటినుండి నాపుత్రులతో పెక్కుదినాలు పదరాని ఇడుమలు గుడిచితిని. ఆ కారణమున నేను గళాకాంతులు లేనిదాననై వనరుచున్నాను. ఇప్పుడు బృందావనమున నడుగుబెట్టితిని. ఇదె యత్యంత ప్రియమైన రూపముగల సుందరినయి నవయువతివలె నయితిని. కాని నా యొద్దఁ బడియున్న యీనాపుత్రు లిప్పుడును మనలోకములేక యుస్సురుస్సురనుచుఁ గ్లేశమనుభవించుచునే యున్నారు. నే నీ చోటు విడిచి, విదేశములకుఁ బోవలె ననుకొనుచున్నాను. వీరిరువురు చీఁకుముదుసళ్ళయినారు. వీరలదే నాకు దుఃఖము, మునిచంద్రా ! మే మొకరి నొకరము విడిచియుండ లేము. కూడి యాడి యుందు వారము. కొడుకులు వృద్ధులయి, తల్లిపడుచుఁ దనము గలదయియుండుట లోక విరుద్ధముకదా! ఈస్థితి కేమి కారణము? తల్లి పెద్దదయి బిడ్డలు పడుచువారయి యుండుట తగును. అది సహజము. ఈ కారణమున నామనస్సు చెదరి, చింత పడుచున్నాను. నీవు బుద్ధిమంతుఁడవు. పైఁగా యోగ నిధివి, దీని కేమి కారణమయి యుండఁగలదో తెలుపుము.

**నారదు :–** సాధ్వీ ! నేను నా హృదయమున జ్ఞానదృష్టితో నిప్పుడే నీ దుఃఖకారణమును దెలిసికొని చెప్పెద. ఓపిక పట్టుము. నీ వేప్రకారముగను విచారపడకుము; నీకు భగవంతుడు మేలుచేయునుగాక. అని యప్పుడు మునివరుఁడగు నారదుఁ డొకక్షణము యోజించి కారణమును దెలిసి యిట్లని చెప్పెను.

**నారదు :–** 'బాలా ! నీవు సావధానురాలయి వినుము. ఇది భయంకరమగు కలికాలము. ఇందుచే నీసమయమున సదాచారము, యోగమార్గము, తపము మొదలగునవన్నియు లోపించిపోయినవి. లోకులస్వభావము కుచ్చితముచేతను, గుకర్మలచేతను, పావులగు దైత్యులవలె నయ్యెను. ప్రపంచమున నెక్కడయినఁ జూడుము. సత్పురుషులు దుఃఖములతో నణఁగారి, దుష్టులు పై కోపుగానున్నారు. (ఈ కాలమున గండాగొండియైన గడుసరియే ధైర్యశాలియనియు జ్ఞానియనియుఁ బండితుఁడనియు గ్రహింపబఁడు చున్నాడు.) చదువుతో సంధ్యతోఁబనిలేదు. పుడమి క్రమముగా నాయేఁటి కాయేఁడు శేషునకు భార రూపమయి పోవుచున్నది. ఇప్పుడది స్పృశించుటకే యోగ్యము కాదననేల, కనులతోఁ జూచుటకును యోగ్యతకలదిగాను నుండినదికాదు. అందెందు వెదకిచూచినను మంచి గానరాదు. నీ జోలి నీ బిడ్డలజోలి యిప్పుడెవరికిఁ బట్టినది? మీతో వారికేమి కావలసియున్నది? విషయాంధులయి వారుపేక్ష చేయుటచేతనే మీకీగతి పట్టినది. కాని శ్రీ బృందావనమునందుఁ జేరుటచే నీవు తిరిగి నవతరుణివలె నయితివి. సర్వత్రభక్తి. తాండవ మొనరించుటచేతనే ఈ శ్రీ బృందావనధామము ధన్యమయినది. అయినను ఈ జ్ఞాన వైరాగ్యములఁ బ్రస్తావమెత్తువా రిందెవరునులేరు. ఆ కారణమున వీరికి బడుగు తనము పోయినది కాదు. కాని, హా ! వీరిచిత్తమున కొకింత యేదో హాయి చిక్కయుండవలెను. అందువలననే గాఢనిద్రవంటి సుఖము ననుభవించుచుఁ బడియున్నారు.' అని నారదుఁడు వచింప, విని

**భక్తి :–** నాయనా ! శ్రీపరీక్షిన్మహారా జీపాపి కలియుగము నేల బ్రతికియుండ నిచ్చెను? చూడుఁడు ! ఇది వచ్చినంత నే యేమిమాయయో, సర్వవస్తువులలోని సారమంతయు నెక్కడకుఁ బోయినదో దెలియదు. కరుణామయుఁడగు భగవానుఁడును దా నీయధర్మము నేల చూచుచు నూరకున్నాఁడో? మునినాథా!

నాకీసందేహమును దీర్పుము. నీ శ్రీసూక్తులచే నాకు మిక్కిలి శాంతి చేకూరినది.' అని చెప్ప విని

**నారదుఁడు :-** బాలా ! నీవడిగెదవా? ఇదిగో, చెప్పెద; ప్రేమపూర్వకముగ విను. దీనివలన నీ విచారమెంతయు దూరముకాఁగలదు. ఏనాఁడు శ్రీకృష్ణభగవానుఁ డీభూలోకమును విడిచి, తన పరమధామమునకు వేంచేసెనో, యానాఁడే యిక్కడ సమస్త సాధనముల బాధించెడి కలియుగము ప్రారంభమయ్యెను. శ్రీపరీక్షిన్మహారాజు దిగ్విజయమునకుఁ బోయినప్పుడీకలిని జూచెను. అప్పుడీకలి యెంతోదీనముగ నా ప్రభువును శరణువేఁడెను. రాజు భ్రమరమువలె సారగ్రాహి కావున 'నేను దీనిని వధింపరా' దని యోజించి, పోవిడిచెను. ఏల దీనిని జంపరాదన, దీనియం దపూర్వమగు నొక గొప్ప గుణముకలదు. ఇతర యుగములందుఁ దపము, యోగము సమాధి మున్నగు వానివలనఁ బడయవలనుపడనిఫల మీయుగమునందుఁ గేవల హరికీర్తనము చేతనే పూర్తిగా లభింపఁగలదు. ఈ కలియుగము సర్వవిధముల సారహీనమయిన దేయయినను, యిందలియొక్క గుణముచూచి యది సారయుక్తమని, యుత్తరానందనుండు కలియుగమందు. బుట్టెడి జీవుల సుఖముకొఱకే దీనిని మని యుండ నిచ్చెను.

ఈ సమయమునఁ గుకర్మములు ప్రబలిన కారణమున సర్వవస్తువులలోని సారమంతయు వట్టిపోయినది, భూమిలో నెన్ని పదార్థములున్నవో యన్నియు మాడిపోయి నిస్సారములైన విత్తనములయినవి. బ్రాహ్మణులుకూటిమీఁది యాశచేనధికారియనక యనధికారి యనక యింటింటికేగి భగవత్కథను వినిపింపఁ జాగిరి. ఇందుచేఁ గథలోఁ గొంచెమయినను మహత్తు లేకుండఁ బోయినది. తీర్థములందు మిగుల ఘోరకృత్యము లొనరించు వారు, నాస్తికులు, నారకీయపురుషులు నుండఁజాగిరి. ఇందుచేఁ దీర్థములందును బ్రభావ మేమియు లేకుండఁ బోయినది. కామము, క్రోధము, లోభము, తృష్ణ మున్నగు వానిచే నిరంతరము తపించెడి చిత్తముగలవారు తపముచేయువారివలె నటించుటచేఁ దపములోను సారము లేకుండఁబోయినది. మనస్సంయమము లేనికారణమునను, దంభము, లోభము, పాషండత్వమున కది యాశ్రయమయిన, కారణమునను శాస్త్రాభ్యాసము చేయనికారణమునను ధ్యానయోగమునకు నెట్టి ఫలము లేకుండఁబోయినది. పండితులన్నవారు దున్నపోతుల వలెఁ దమ స్త్రీలతో రమించుచు, సంతానమును గనుట యందుఁ గౌశల్యమును సంపాదించిరే కాని ముక్తి సాధనమందు సర్వథా యసమర్థు లయిపోయిరి. సంప్రదాయ పరంపరగా వచ్చిన వైష్ణవత్వ మెందును గానరాకున్నది. ఈ ప్రకారమెందెందుఁ జూచినను సమస్తవస్తువులలోని సారమంతయు నడుగంటి పోయినది. ఇది యన్ననో, యీ యుగముయొక్క స్వభావమే; ఇందెవరి దోషము లేదు. ఈ కారణమున నత్యంత సన్నిహితుఁడయి యుండియు శ్రీహరి యన్నిఁటి నోర్చి యున్నాఁడు.' అని నారదుఁడు భక్తితోఁ జెప్పెను.

**సూతు :-** శౌనక మునిపుంగవా? యీ ప్రకారము చెప్పిన నారదముని వచనములను విని భక్తికి మిగుల నాశ్చర్యము కలిగెను. తరువాత నామె యేమియడిగెనో దానిని జెప్పెద - వినుఁడు. అంత భక్తి నారదమహర్షిని జూచి దేవర్షీ! మీరు ధన్యులరు. నేనెంతో యదృష్టవంతురాలను గనుకనే మీరిక్కడకు విచ్చేసితిరి. సంసారమున సాధుదర్శనము సర్వకార్యముల సిద్ధింపఁజేయునట్టి సర్వశ్రేష్ఠదుగు సాధనము. నారద మహర్షీ ? మీ యుపదేశ మొకదానిని వినినమాత్రముననే కయాధూకుమారుఁడయిన ప్రహ్లాదుఁడు సంసారమందు మాయను గెలిచెను. మీకృపచేతనే ధ్రువుఁడు ధ్రువపదమును బ్రాప్తించెను. మీరు సర్వమంగళస్వరూపులరు. సాక్షాత్తు బ్రహ్మమానసపుత్రులరు. మీకిదే నమస్కార మొనరించెదను.

# ద్వితీయాధ్యాయము

**నారదుఁ డిట్లనియె :–** బాలా ! నీవూరక ఖేదపడెదవేల? ఇంత చింతాతురవు కానేల? శ్రీకృష్ణభగవానుని చరణ కమలములఁ జింతన మొనరింపుము. ఆ ప్రభుని కృపచే నీ దుఃఖమంతయు దూరముగఁపోఁగలదు. కౌరవుల యాత్యాచారమునుండి ద్రౌపదినిఁ గాపాడినవాఁడు, గోపమందరుల ననాథలఁ జలిపి యేలినవాఁడు నగు నాశ్రీకృష్ణుఁ డిప్పు డెక్కడకుఁ బోయినాఁడు? మఱి నీవో భక్తివి. ఆ విభునకు సదా ప్రాణముకంటెఁ బ్రియమైనదానవు. నీవు పిలచితివేని వెంటనే నీచజనుల కొంపలకైనను తాను బరుగెత్తి వచ్చును. సత్యము, త్రేత, ద్వాపరమను నీ మూఁడుయుగములందు, జ్ఞానము, వైరాగ్యము ముక్తికి సాధనములయి యుండెను; కాని యీకలియుగమందన్ననో కేవలము భక్తియే సాధనము. అది బ్రహ్మసాయుజ్య (మోక్ష) మును బ్రాపింపఁ జేయును. ఈ ప్రకారము యోజించియే పరమానంద స్ఫూర్తి, జ్ఞానస్వరూపి, శ్రీహరి సత్స్వరూపముతో నిన్ను సృజించెను. నీవు శ్రీకృష్ణచంద్రునకు సాక్షాత్తు ప్రియురాలవు. పరమసుందరివి. నీవొకప్పుడు జేతులు జోడించి 'నేనేమి చేయుదు'నని యడుగ భగవానుఁడు "నాభక్తులఁ బోషణము చేయు" మని యానతిచ్చి యుండెను. నీవు భగవంతుని యాజ్ఞను స్వీకరించి యుంటివి. అందుచే నీపై శ్రీహరి ప్రసన్నుఁడయి, నీసేవచేయుటకు ముక్తిని నీకు దాసిగను, జ్ఞాన వైరాగ్యులను బుత్రులుగను బ్రసాదించి యుండెను. నీవు నీసాక్షాత్స్వరూపముతో శ్రీవైకుంఠధామ మున భక్తుల పోషణము చేయుచుందువు; భూలోకమందో నీవు వారి పుష్టికయి కేవలము ఛాయా రూపమును ధరించి యున్నావు.

అప్పుడు నీవు ముక్తి, జ్ఞాన, వైరాగ్యులను వెంట నిడుకొని పృథివీతలమున కేతెంచి, సత్యయుగము నుండి ద్వాపరము వఱకు మిగుల నానందముతోనుంటివి. కలియుగమునందు నీదాసి ముక్తి పాషండ రూపవ్యాధులచేఁ బీడింపఁబడి. క్షీణించి పోఁజాగెను. ఆ కారణమున నది వెంటనే నీ యాజ్ఞచే వైకుంఠమునకు వెడలిపోయెను. ఈలోకమందును నీస్మరణచేసినంతనె యది వచ్చును. మరల వైకుంఠ మునకుఁ బోవుచుండును. కాని యీ జ్ఞానవైరాగ్యులను నీవు పుత్రులనుగ నెంచి, నీయొద్దనే యుంచు కొంటివి, వెండియుఁ గలియుగమున నెల్లరువీరి నుపేక్షించుటచే నీ పుత్రులగు వీరిట్టు లుత్సాహ హీనులయి వృద్ధులయిపోయిరి. అయినను నీవు చింతిల్లకుము, వీరి నుద్ధరించుట కుపాయ మాలోచించు చున్నారు; సుముఖి ! కలియుగమునకు సాటియైన యుగమే లేదు; ఈ యుగమున నేను నిన్ను యింటింటను బ్రతిపురుషుని హృదయమునందును స్థాపించెదనుగాక. చూడు మితరధర్మముల నన్నిటిని ద్రోసిరాజని, నిన్ను బ్రచారమునకుఁ దేకుండితనేని, నేను శ్రీహరికి దాసుఁడనేకాను. కలియుగమున నేజీవిపై నీ కృప కలిగెనో, వాఁడెంతటి మహాపాపియేకాని, జంకుకొంకులేక శ్రీకృష్ణభగవానుని యభయధా మమునకు వేంచేయును. ఎవని హృదయమునఁ బ్రేమరూపిణియగు భక్తి నివాసముచేయునో, యా పవిత్రమూర్తి స్వప్నమందును యముని ముఖమును జూడఁడు. ఎవని హృదయసీమ భక్తి రాణి నివాసము చేయుచుండునో, వానిని ప్రేత, పిశాచ, రాక్షసద్వైతులు మున్నగువారు స్పర్శచేయుటకును సాహసింపఁజాలరు. భగవానుఁడు తపము, వేదాధ్యయనము. జ్ఞానము, కర్మము మున్నగు నే సాధన ములకును వశపడఁడు. కేవలము భక్తిచేతనే వశీభూతుఁడగును. దీనికి గోపి కామతల్లులే ప్రమాణము. మనుష్యుల కనేకజన్మములం దార్జించిన పుణ్యవిశేషముననే భక్తియందనురాగము కలుగును. కలియుగ మందన్ననో, భక్తియే సారమయినది. భక్తిచేతనే సాక్షాత్తు శ్రీకృష్ణచంద్రుఁడు సాన్నిధ్యము ననుగ్రహించును. భక్తికి ద్రోహమెంచువారు ముజ్జగములం దెందును శాంతిని బడయఁ జాలరు; పూర్వకాలమున భక్తుని తిరస్కరించి దుర్వాసుఁడను ఋషి యెంతటి కష్టములపాలు కావలసి వచ్చెనో – చూడుము. వ్రతములు, తీర్థములు, యజ్ఞములు, జ్ఞానచర్చలు మున్నగు వేలసాధనములతో నేమిపని, ముక్తియో కేవలము భక్తిచేతనే లభింపగలదు.

**సూతుఁడు :–** ఈ ప్రకారము శ్రీనారదులు నిర్ణయము చేసిన తన మాహాత్మ్యమునువిని భక్తికంగములన్నియుఁ బుష్టివహించెను. వానియందు బలమువచ్చెను. అంత భక్తియిట్లని చెప్పఁదొడఁగెను.

నారదమునిపుంగవా? నీవు ధన్యుఁడవు–నీకు నాయెడ నిశ్చలమగు ప్రీతికలదు – నేను సదా నీహృదయమున నుందును. ఎప్పుడును విడిచిపోవను. సాధూ ! నీవు మిగులఁ గృపాలుఁడవు – ఒక క్షణములో నాదుఃఖమునంతయు దూర మొనరించితివి. కాని యింకను నాపుత్రులకు స్ప ృహరాలేదు. దయయుంచి వీరికిని శీఘ్రముగాఁ దెలివి వచ్చు మార్గమును జూడుము.

సూతుఁడిట్లనెను. భక్తియాడిన యీ వచనములను విని నారదునకు మిగుల జాలిపొడమెను. వారిని తన చేతులలో నటు నిటు పొరలించితట్టి, మేలుకొనఁ జేయఁజూచెను – మఱియు వారి చెవులకడ నోరుపెట్టి "ఓజ్ఞానదేవా ! లే, త్వరగా లెమ్ము – ఓ వైరాగ్యమూర్తీలెమ్ము. వేగమే, లెండుయని బిగ్గరగా నఱచెను – మఱి

మఱి వేద ధ్వని, వేదాంత ఘోష గీతాపాఠము లొనరించెను – వారిని మేల్కొలుపఁ నెంతో కష్ట పడెను – వారెట్లెట్లో బలవంతముగా లేచిరి. కాని యలసతకతమున వారిరువురావులించుచు, గనులతెప్పలు విచ్చి చూడఁజాలక మరలఁబరుండిరి–వారి వెంట్రుకలు, కొంగతెక్కలవలెఁ దెల్లనయ్యెను. వారి యంగములు శుష్కకాష్ఠమునకు సమానముగాఁ నిస్తేజములయి కొఱడు వాఱిపోయెను – ఈ ప్రకార మాఁకలిదప్పులచే నత్యంత దుర్బలులయిన కారణమున వారలు మరల పండుకొని నిద్దురపోవుటఁ గాంచి నారదుఁడు చాల విచారమును నొంది "నేనిఁక నేమి చేయుదును? వీరి యీ నిద్ర, దానిని మించిన వీరివృద్ధాప్యము నెట్లు పోఁగొట్టవచ్చును? అని యోచనా పరంపరలలో మునిఁగి పోయెను". ఈ సమయమున నాకాశవాణి "మునీంద్రా ! ఖేద పడకుము. నీ ప్రయత్నము నిస్సందేహముగా సఫలము కాఁగలదు – దేవర్షి ! దీనికై నీవొక సత్కర్మ మొనరింపుము. ఆ కర్మమును సంతశిరోమణులు తెలుపఁగలరు. ఆ సత్కార్యము ననుష్ఠించినంతనే చిటికెలో వీరినిద్ర యీ వృద్ధావస్థ తొలఁగి పోవును. అంత సర్వత్ర భక్తిప్రసారము కాఁగలదు." అని చెప్పెను. ఆయాకాశవాణి యక్కడ నున్న వారికందఱకును స్పష్టముగా వినిపించెను. దీనిచే నారదునకు పరమ విస్మయము కలిగి "దీని యభిప్రాయమేమో నామనస్సునకు రాలేదే" యని తనలో నిట్లని యోజింపఁబూనెను. ఈయాకాశవాణి చాఁటున నుండి యేమేమో పలికినది. నా ప్రయత్న మెద్దాన సిద్ధించునో యా సాధనమును దెలువదాయెను. ఆసంత మహాత్ములెందు లభింపఁగలరు? ఏవిధముగ నాసాధనమును దెలిపెదరు? నాకేమియుఁ దోఁచకున్నది. ఇప్పు డాకాశవాణి చెప్పిన ప్రకారము నేనేమి చేయవలెను?

**సూతుఁడు :–** నారదుఁడిట్లు చింతించి భక్తిని జ్ఞాన వైరాగ్యులిద్దర నందవిడిచి, తానక్కడనుండి వెడలిపోయెను. తీర్థములన్నియుఁ దిరిగెను – దారిలోఁ గనవచ్చిన మునుల నెల్ల నీ సాధనమును గుఱించి యడిగెను – ఆనారదుని మాటల నెల్ల వారు విన్నవారే కాని యెవరు కాని యావిషయము నిదమిత్థమని నిశ్చయించి చెప్పినవారు కానరారైరి. అసాధ్యమని కొందఱనిరి. కొందఱు దీని వాస్తవమెఱుఁగుట కఠినమనిరి. కొందఱు కిమ్మనకుండిరి. తెలియదనిన నవమానమని భయపడి కొందఱు యేదియో సాకు చెప్పి తప్పించుకొనిపోయిరి. మూఁడు లోకములందును మిగుల విస్మయజనకమగు హాహాకారము ప్రబలిపోయెను. ఎల్లరును గుజగుజలు పోఁజాగిరి. అన్నా వేదధ్వని, వేదాంతఘోష, ముహుర్ముహుర్గీతా పాఠమున భక్తి, జ్ఞాన వైరాగ్యముల కుద్బోధనము కలుగ దేని, యిఁక వేఱుపాయ మేదియుండఁగలదు. బళా ! యోగిరాజు నారదుల వారికే దానిజాడ తెలియనిచో, పామరులగు సంసారి జడులేమి తెలియఁ గలరు? ఈ ప్రకారమే యేఋషులతో నీ విషయమును గుఱించి ముచ్చటించిరో వారెల్లరు నిర్ణయించి "యీ విషయము దుస్సాధ్యమే" యని చెప్పిరి. అంత నారదుఁడు దురంతచింతాతురుండయి, దీని కొఱకేను దపము చేసెదఁగాకయని నిశ్చయము చేసికొని బదరికావనమున కేగెను. అచటకుఁ జేరినంతనే తన సమీపమునఁ గోటిసూర్యులతో సాటియైన తేజస్సుగల సనకాది మునీశ్వరుల దివ్య దర్శనము లభించెను. వారిని జూచి మునిశ్రేష్ఠుఁడగు నారదుఁ డిట్లని విన్నవించెను.

**నారదుఁడు :–** మహాత్ములారా ! తమ సమాగమము లభించిన ఈక్షణ మెంతో సౌభాగ్యవంతమయినది. తాము నాయందు దయయుంచి శీఘ్రమే యా సాధనమును ప్రసాదింపుఁడు. తామెల్లరు మహాయోగులరు. బుద్ధిమంతులరు, విద్వాంసులరు, చూచుటకుఁదా మైదేడుల బాలకులవలెఁ గాని పించెదరు. కాని పూర్వజులకును తాము పూర్వజులరు. మరీచి మున్నగు ప్రజాపతులును వయస్సునఁ దమకంటెఁ చిన్నవారు. తాము సదా శ్రీవైకుంఠధామమున వేంచేసియుందురు. నిరంతరము హరికీర్తన మునఁ దత్పరులయియుందురు. భగవల్లీలామృత రసాస్వాదన మొనరించి సదా యున్మత్తులవలె నుందురు. భగవచ్చర్చయే తమకుఁ బ్రధానమగు జీవనాధారము. తమ శ్రీముఖమున సర్వదా 'హరిశ్శరణం' (భగవానుఁడే మాకు రక్షకుఁడు) అను వాక్య (మంత్ర) మే యుండును. ఈ కారణమునఁ గాలప్రేరితమగు వృద్ధావస్థయొక్క వప్పు మీముందుడ కదు. పూర్వకాలమున మీ బొమముడి మాత్రముననే భగవంతుఁడగు శ్రీమహావిష్ణువుయొక్క ద్వారపాలకుయిన జయవిజయులు తక్షణము పుడమి బడి, మరల మీయనుగ్రహముచే శ్రీవైకుంఠ లోకమునకుఁ బోవఁ జాలిరి. ఈ సమయమునఁ దమ దర్శనము మహత్తర సౌభాగ్యమునఁ బ్రాప్తించినది. నేను బరమదీనుఁడను. తాము స్వభావ సిద్ధిముగనే దయాళురు. కాన నాయెడల నవశ్యము కృపచేయవలెను. అనుగ్రహింపుఁడు. ఆకాశవాణి తెలిపిన విషయ మెయ్యది? ఆ సాధన మెట్లను ష్ఠించవలెను? తాము దానినిగురించి విస్తరించి తెలుపుఁడు. భక్తి జ్ఞాన వైరాగ్యులకు సుఖమెట్లు లభించును. వీనిని బ్రేమ పూర్వకముగ సర్వవర్ణము లయందుఁ బ్రచార మెట్లు చేయనగును?

**సనకాదు లిట్లనిరి :–** దేవర్షీ ! చింతిలకుము. మనమునఁ బ్రసన్నత వహింపుము. చూడు వీరి నుద్ధరించుటకు సరళమగు నుపాయము ప్రథమమునుండి ప్రసిద్ధిగానున్నది. నారదా ! నీవు ధన్యుఁడవు. నీవు

విరక్తులలో శిరోమణివి. నారదా ! శ్రీకృష్ణదాసులలో సదా యగ్రగణ్యుడవు. యోగమునకు సాక్షాత్తు సూర్యుఁడవే. నీవు భక్తికొఱకు చేయు యుద్యోగ మేమియు నాశ్చర్యమైన విషయము కాదు. భగవద్భ క్తులకో భక్తిస్థాపన చేయుట యుచితమే. ఋషు లీ ప్రపంచమున ననేక మార్గములను బ్రకటించి యున్నారు. కాని యవియన్నియుఁ గష్టములు మాత్రమే. ఇంతదనుక భగవత్ప్రాప్తినిఁ గలిగించు మార్గము గుప్తమయియే యున్నది. దాని నుపదేశించు పురుషుఁడు భాగ్యవశముననే లభింపఁగలఁడు. నీకాకాశవాణి సూచించిన సత్కార్యమును మేము విశదీకరించెదము. నీవు ప్రసన్నుఁడవయి సమాహిత చిత్తమున నాలింపుము.

నారద మునీశ్వరా ! ద్రవ్యయజ్ఞము తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయరూపజ్ఞానయజ్ఞము – ఈయన్నియు స్వర్గాదులను గలిగించు కర్మమునే సూచించును. పండితులు జ్ఞానయజ్ఞమునే సత్కర్మ (ముక్తిదాయక) ముగాఁ దలఁచు చున్నారు. అది శ్రీమద్భాగవత పారాయణము. శ్రీశుకాది మహానుభావు లిట్లని నిరూపణ చేసియున్నారు. దానిమాట విన్నంతనే భక్తి, జ్ఞానవైరాగ్యములకు మిగులసత్తువ గలుగును. దీనిచే జ్ఞాన వైరాగ్యముల కష్టము తొలఁగిపోవును. భక్తి కానందము లభింపఁగలదు. చూడు ! సింహ గర్జనము వినినంత తోడెళ్లు కాలికి బుద్ధి చెప్పునట్లు, శ్రీమద్భాగవత ధ్వనితోనే కలియుగము యొక్క దోషములన్నియు దూరముగాఁ బోవును. అంత ప్రేమరసమును బ్రవహింపఁ జేయు భక్తి, జ్ఞాన వైరాగ్య సమేతముగఁ బ్రతియింటను, బ్రతివ్యక్తియు హృదయమందును గ్రీడింపఁ గలదు. అన్ని చోటులను దీని ప్రచారము లెస్సగఁ గాఁగలదు.

**నారదుఁడు :–** నేను వేదవేదాంతధ్వని, గీతాపాఠము చేసి వాని నెన్నివిధములనో ప్రబోధించితిని. కాని భక్తి, జ్ఞాన, వైరాగ్యము లించుకంతయు మేల్కొనినవి కావు. కాగా ఇట్టి స్థితిలో శ్రీమద్భాగవతము వినిపించిన మాత్రనే వాని కెట్లు చైతన్యము కలుగఁగలదు? ఏలనన :– ఆ కథయొక్క ప్రతిశ్లోకమున. బ్రతి పదమునను వేదముయొక్క సారాంశమే యున్నది. తాము శరణాగతవత్సలురు. తమ దర్శనము వ్యర్థమెప్పుడును గానేరదు. కావున నా యీ సందేహమును బాపుఁడు. ఈ కార్యమున విలంబము సేయకుఁడు.

**సనకాదులు :–** శ్రీమద్భాగవతకథ, వేదము ఉపనిషత్తుల సారముచేఁ గల్పింపబడినది. ఇందువలన వానికంటె వేఱయి, వానికి ఫలమాపమయిన కారణమున వానికంటె నుత్తమమయినదిగా గుణింపఁబడుచున్నది. ఒక వృక్షము యొక్క వేరునుండి శాఖాగ్రమువఱకు రసముండినను నీస్థితిలో నారసము నాస్వాదనము చేయఁజాలము. ఆరసమే వానినుండి వేఱయి ఫలరూపమును బొందినప్పు డీ ప్రపంచమున నెల్లరకును బ్రియమైనదయియొప్పును. పాలలో నేయియున్నది. కాని యాస్థితిలో దాని రుచి ప్రత్యేకముగ నాస్వాదింప వలనుపడదు. అది యాపాలనుండి వేఱుగఁదీయఁబడినప్పుడు, దేవతలకును స్వాదునర్ధకము కాఁగలదు. కలకండ చెఱకుగడలో నంతటను నిండియుండునప్పటికిని, దానినుండి వేఱుగాఁదీసి నప్పుడు మఱింత మధురముగానుండును. అట్లే భాగవతకథయు ఈ భాగవతపురాణము వేదములకు సమానమయినదిగా నెంచఁబడుచున్నది. శ్రీవేదవ్యాస భగవానుఁడు దీనిని, భక్తిజ్ఞాన వైరాగ్య స్థాపన కొఱకే ప్రకాశింపఁజేసినాఁడు. వేదవేదాంత సారగామియు, గీతారచనకారుఁడునగు శ్రీవేదవ్యాస భగవానుఁడు పూర్వకాలమున ఖిన్నుఁడయి యజ్ఞానసముద్రమున మునిఁగియుండినప్పుడు నీవేకదా చతుశ్లోకములలో దీని నుపదేశించితివి. దాని వినఁగానే యావ్యాసమునికిఁ గలిగిన విచారమంతయుఁ దొలఁగిపోయెను. అట్టి నీకిప్పుడు దీని విషయమున నేల యాశ్చర్యము కలిగి యిట్లు ప్రశ్న చేయుచున్నావు? నీవు శోకమును దుఃఖమును బాఱఁదోలునట్టి శ్రీమద్భాగవత పురాణము వినిపింపవలెను.

**శ్రీనారదుఁడు :–** మహానుభావులారా ! తమ దర్శనము జీవుల పాపపుంజములనెల్లఁ దతక్షణమ నశింపఁజేయును – సంసార దుఃఖ దావానల సంతప్తులయినవారిమీఁద వైళమ శాంతి వర్షమును గురియించు – తాము నిరంతరము శేషుని సహస్ర ముఖములనుండి వెడలు భగవత్కథామృతమును పానము చేయుచుందురు. నేను ప్రేమలక్షణ భక్తిని బ్రకాశింపఁజేయు నుద్దేశముతోఁ దమ శరణు వేఁడుచున్నాను. అనేక జన్మములందు సముపార్జించిన పుణ్యపుంజ ముదయమయినఁగాని మానవులకు సత్సంగము లభింపదు. ఆసత్సంగము దొరికినచో నజ్ఞానముచేఁగలిగిన మోహము, మదమనెడి యంధకారము నాశమయి వివేకోదయము కాఁగలదు.

# మూఁడవ అధ్యాయము

## భక్తి కష్టనివృత్తి

**నారదుఁడు :-** మంచిది. అయిన నేనిప్పుడు భక్తి జ్ఞాన వైరాగ్యసాపనకయి ప్రయత్నపూర్వకముగ, శ్రీశుక దేవగదిత శ్రీభాగవతశాస్త్రకథమూలమున నుజ్జ్వలమగు జ్ఞాన యజ్ఞమును గావించెదను. ఈ జన్నము నేనెక్కడ చేయవలెను? తాము దీనికిఁ దగిన స్థానమును జూపుఁడు - తాము వేదముల సారము ముట్టఁదెలిసినవారు. కావున నాకీ శుకశాస్త్రమహిమ కొంత వినిపింపుఁడు. ఇంతియకాక యీకథ నెన్నిదినములలో వినవలెనో యదియును, దానిని వినవలసిన విధియును దెలుపుఁడు.

**సనకాదులు :-** నారదా ! నీవు మహావినయవంతుఁడవు వివేకివి విను. నీకు మేము సర్వవిషయములు వివరముగాఁ దెలిపెదము - హరిద్వారము దగ్గఱ నానందమనెడి ఘట్టము గలదు. అక్కడ ననేకులు ఋషులుండెదరు. దేవతలు సిద్ధులు దానిని సేవించుచుందురు. వివిధములగు వృక్షలతాదులకారణ మున, నది సఘనమయిన దయి యొప్పుచుండును - అందత్యంత కోమల నవీన వాలుక సొంపుగా నుండును. ఆ ఘట్టము మిగుల రమ్యమై, యేకాంతప్రదేశమయి యొప్పియున్నది. అందెల్ల వేళల బంగరుకమలముల సుగంధము వీచుచుండును. దానికిఁ జుట్టుపట్లనుండెడి సింహములు, హరిణములు మున్నగు సహజ విరోధస్వభావముగల జంతువులు చిత్తమున వైరభావమును మానియుండును. అచ్చట విశేషశ్రమము లేకయే నీవు జ్ఞాన యజ్ఞారంభము చేయవలెను. అందు జరగెడి కథయం దపూర్వ రసము పొడమఁగలదు. భక్తియును, నీకన్నుల కెదుట నిర్బలులయి ముసలితనమున వగ్గులయియున్న జ్ఞానవైరాగ్యులను దీసికొని రాఁగలదు ఏలననఁగా, నెందు భాగవతకథ జరగునో, యచ్చట కీ భక్తి మున్నగునవి తమంతన వచ్చి చేరును. అచ్చోటఁ జెవులలో కథాశబ్దము పడినంతటనే యా భక్తిజ్ఞాన వైరాగ్యములు మూఁడును తరుణభావమును బొందును.

**సూతుఁడు :-** ఈ ప్రకారము చెప్పి నారదునితో సనకాదులు శ్రీ భాగవతకథామృతమును బానము చేయుట కయి యక్కడనుండి గంగాతీరమునకు వేంచేసిరి. వారుగంగాతటమునకు వేంచేసినంతట భూలోక దేవలోక బ్రహ్మలోకము లేల సమస్తదేశములం దెల్లెడ భగవత్కథా విషయమైన వార్త వ్యాపించెను. శ్రీ భగవత్కథారసికులయిన విష్ణుభక్తులందఱు శ్రీమద్భాగవతకథామృతపానము చేయుటకయి ముందుగాఁ బరుగుపరుగున రాఁజాగిరి. భృగువు, వసిష్ఠుఁడు, చ్యవనుఁడు, గౌతముఁడు, మేధాతిథి, దేవలుఁడు, దేవరాతుఁడు, పరశురాముఁడు, విశ్వామిత్రుఁడు, శాకలుఁడు, మార్క ండేయుఁడు, దత్తాత్రేయుఁడు, పిప్పలాదుఁడు, యోగేశ్వరుఁడగు వ్యాసుఁడుఁ పరాశరుఁడు, ఛాయాశుకుఁడు, జాబాలి, జహ్ను మున్నుగాఁ గల ప్రధాన మునిగణములు తమతమ పుత్రులు శిష్యులు, స్త్రీలతోఁగూడి మిగుల ప్రేమతో నక్కడకు విచ్చేసిరి, వీరు గాక వేదములు, ఉపనిషత్తులు, మంత్రములు, తంత్రములు, పదునేడు పురాణములు, ఆఱు శాస్త్రములును మూర్తిమంతములయి యక్కడకు వచ్చెను. అట్లె గంగానదులు, పుష్కరము మున్నుగాఁగల సరోవరములు, కురుక్షేత్ర మాదిగాఁగల క్షేత్రములు, సమస్తదిక్కులు, దండకాదివనములు, హిమాలయము మొదలుగాఁగల పర్వతములు దేవ, గంధర్వ దానవులాదిగా నెల్లరును గథను వినుటకు వచ్చిరి. మేము గొప్పవారమనెడి యభిమానమున నచటకురా సంకోచపడు వారిని భృగు మహర్షి లాలించి బుజ్జగించి పిలుచుకొని వచ్చెను.

అంత కథను వినుటకు దీక్షపూని శ్రీకృష్ణపరాయణులయి నారదుఁడర్పించిన సుందరమగు దివ్యాసనమున సనకాదులు వేంచేసి యుండిరి. ఆసమయమున శ్రోతలందఱు వారికి వందనము చేసిరి. వినువార లలో, వైష్ణవులు, విరక్తులు, సన్న్యాసులు, బ్రహ్మచారులు ముందు కూర్చుండిరి. అందఱకు ముందుగా శ్రీనారదులవారు కూర్చుండిరి. ఒక యోర ఋషి గణము, ఒకవైపు దేవతలు, ఒక వంశ వేదములు ఉపనిషదాదులు, అట్లే యొక ప్రేవఁ దీర్థములు నుండెను. వేఱొకప్రక్క స్త్రీలు కూర్చుండిరి. ఆ సమయమున, జయజయనినాదములు, నమోవాకధ్వనులు, శంఖారావములు చెలరేగెను. గందవొడి చల్లిరి. పూలవానగురిసెను. కొన్ని దేవగణములు విమానములు నధిరోహించి, యందుఁ గూర్చుండిన వారందఱు మీఁదఁ గల్పవృక్షముల పుష్పములఁ గురియఁసాగెను.

**సూతుఁడు :-** ఈ ప్రకారము పూజ సమాప్తమయిన పిమ్మట నెల్లవా రేకాగ్రచిత్తులయి యుండిరి. అంత సనకాదులు నారదమునికి శ్రీమద్భాగవత మాహాత్మ్యమును స్పష్టీకరించి వినిపింపఁ సాగిరి.

**సనకాదులు :-** ఇప్పుడు మేము నీకీ భాగవతశాస్త్ర మహిమను వినిపించు చున్నాము. దీనిని విన్నమాత్రమున ముక్తి కరగతమగును. శ్రీమద్భాగవతకథనో సదా సేవించుచుండవలెను. దీని శ్రవణమాత్రముననే

హృదయమున శ్రీహరి విచ్చేసి విరాజితుఁడగును. ఈ గ్రంథమునఁ బదునెనిమిదివేల శ్లోకములు, పండ్రెండు స్కంధములు గలవు. ఇది శ్రీశుకదేవునకుఁ బరీక్షిన్మహారాజునకు జరిగిన సంవాదము. ఈ భాగవత శాస్త్రమును మేము నీకు వినిపించుచున్నాము. మనస్సుంచి వినుము. ఎంతదాఁక నీ శుకశాస్త్రకథ క్షణకాలమయినను జెవినిఁబడదో, యంతదాఁక నీజీవుఁ డజ్ఞానమునఁజిక్కి యీ సంసార చక్రమునఁ దగుల్కొని భ్రమించుచుండును. అనేకములగు శాస్త్రములు, పురాణములు వినిన నేమిలాభము? వానితో వ్యర్థశ్రమము వృద్ధికావుటయేకదా. ముక్తినొసఁగుటకో యొక భాగవతశాస్త్రమే గర్జించుచున్నది. ఏ యింటిలో ప్రతినిత్య శ్రీమద్భాగవతకథ జరుగుచుండునో, యాగృహము, అందున్న వారు తీర్థరూపు లయ్యెదరు. వారిపాపములు నాశము లగును. వేలకొలఁది యశ్వమేథములు, నూర్లకొలఁది వాజపేయ యజ్ఞము లీ శుకశాస్త్రకథకుఁ బదునాఱవపాలయినను సరి గాఁజాలవు. తపోధనా ! ఎంతవఱకు లోకులు శ్రీభాగవత కథ లెస్సగ శ్రవణము చేయరో, యంతవఱకు వారి శరీరమునఁ బాపమునిలచియుండఁ గలదు. ఫలమిచ్చుటలో నీశుకశాస్త్రకథకు లేవియు సాటికాఁజాలవు.

పరమగతి కావలెననెడి యిచ్ఛమీకుఁ గలదేని, మీ నోటితో శ్రీమద్భాగవతమందలి యొక యర్థశ్లోకమో, యొక పాదమో, నిత్యము నియమపూర్వకముగఁ బాఠమొనర్పుఁడు. ఓంకారము, గాయత్రి, పురుష సూక్తము, మూఁడు వేదములు, శ్రీమద్భాగవతము, ఓంనమోభగవతే వాసుదేవాయ యను ద్వాదశాక్షర మంత్రము, ద్వాదశమూర్త్యాత్మకుఁడగు సూర్యభగవానుఁడు, ప్రయాగ, సంవత్సరరూపమయిన కాలము, బ్రాహ్మణులు, అగ్నిహోత్రము, గోవులు ద్వాదశీతిథి, తులసి, వసంతర్తువు, పురుషోత్తమ భగవానుఁడు యీయన్నిటియందు బుద్ధిమంతులగువా రెన్నఁడును భేదమెంచరు. అహర్నిశమర్థ సహితముగ శ్రీమద్భాగవతమును బాఠమొనరించు పురుషుని కోట్ల కొలఁది జన్మములం దార్జించిన పాపము నశించును. ఇందించు కంతైన సందియములేదు. నిత్యప్రతీ శ్రీభాగవతమందలి శ్లోకార్థమో, పాదమో చదువు పురుషునకు రాజసూయాశ్వమేధ యజ్ఞముల ఫలము లభించును, నిత్యము భాగవతము బఠించుట, భగవానుని చింతనముచేయుట, తులసికి నీరు పోయుట, గోవును సేవించుట ఈనాలుగు సమానములు. అంతిమకాలమున శ్రీమద్భాగవత వాక్యమును విను పురుషునిపైఁ బ్రసన్నుఁడయి భగవానుఁడు శ్రీ వైకుంఠధామమునకుఁ గొనిపోవును. ఎవఁ డీ భాగవత శ్రీకోశమును బైఁడి గద్దె యందుంచి విష్ణుభక్తునికి దానము చేయునో, వాఁడవశ్యము భగవత్సాయుజ్యమును బొందును. దుష్టుడెవఁడు తన యాయువునం దొక క్షణమయినఁ జిత్తము నేకాగ్రముచేసి శ్రీమద్భాగవతామృత మునందలి యొక కణమయిన రుచిచూడఁడో, వాఁడాజన్మము చండాలునికి, గాడిదెకు సముఁడయి వ్యర్థముగ గాలమును గడపిన వాఁడగును. వాఁడో తల్లికిఁ బ్రసవవేదన కలిగించుటకు మాత్రమే పుట్టినవాఁడు. ఈ శుకశాస్త్రమునందొక ముక్క యినను వినని పాపాత్ముఁడు బ్రదికియుండిన పీనుఁగు. భూమికి బరువుచేటయిన యాపశుతుల్యుఁడగు మానవుఁడు ఛీఛీ కాల్పనా అని యీ ప్రకారము స్వర్గ మందలి దేవతలలోఁ బ్రధానులయిన యింద్రాదులు పలుకుచుందురు.

సంసారమున శ్రీమద్భాగవతకథలభించుట మిగులఁగఠినము. కోట్లకొలఁది జన్మములలో సంపాదించిన పుణ్యముపండిననే యిది లభింపఁగలదు. కావున యోగనిధిని బుద్ధిమంతుఁడవునగు నారదమహామునీ ! యీ భాగవతకథను బ్రయత్న పూర్వకముగ శ్రవణము చేయవలెను. దీని వినుటకుదినములందే నియమము లేదు. దీనిని సర్వదావినుటయే లెస్స. దీనిని సత్యభాషణ, బ్రహ్మచర్యపాలనపూర్వకముగా వినుట శ్రేష్ఠముగాఁ దలంపఁ బడుచున్నది. కాని కలియుగమున నదిజరుగుట కఠినము. కావున దీనికి శ్రీశుకదేవులవారు దెలిపిన విశేషవిధిఁ దెలిసికొనుట ముఖ్యము. కలియుగమునందుఁ బెక్కుదినములవఱకు చిత్తమును వశమందుంచుకొనుట, నియమ బద్ధుఁడయి యుండుట యెట్టి పుణ్యకార్యమునకు దీక్షితుఁడయి యుండుట కఠినము. కావున నీసమయమున సప్తాహశ్రవణవిధికలదు. శ్రద్ధాపూర్వకకముగ నెప్పుడయినను శ్రవణము చేయుటచేత, అథవా మాఖమాసమున శ్రవణము చేయుటచేత నెట్టి ఫలములభించునో, యాఫలము సప్తాహశ్రమణమునఁగలుగునని శ్రీశుకమహర్షి దెలిపియున్నాఁడు. మనోనిగ్రహము లేకుండుట, రోగబాహుళ్యము ఆయువల్పమగుట, యింకను ననేకదోషములు కలియుగమున సంభవించుటకలదు. గనుకనే సప్తాహశ్రవణవిధాన మేర్పరుపఁబడినది–తపము యోగము సమాధి మున్నగు వానిచేతను లభింపనట్టిఫలము సర్వాంగరూపమున సప్తాహశ్రవణముచేత సహజముగానే లభింపగలదు. సప్తాశ్రవణము యజ్ఞముకంటెను నధికమయినది – వ్రతములకంటెను మించినది. తపముకంటె నెంతో శ్రేష్ఠమయినది. తీర్థసేవనము కంటెను సదా యతిశయమయినది. యోగముకంటె నుత్తమ మయినది. అంతదాఁకఁబోనేల? ధ్యాన జ్ఞానములకంటెను మిన్న. ఆహా ! దీని విశేష మెంతని వర్ణించెదము? ఇదియో యన్నిటికంటెను నుత్కృష్టమయినది.

**శౌనకుఁడు :–** సూతా ! యిప్పుడు నీవు మిగుల నాశ్చర్యమైన విషయమును జెప్పితివి. అవశ్య మీ భాగవత పురాణము యోగ వేత్తయగు బ్రహ్మకును ఆదికారణమగు శ్రీమన్నారాయణుని నిరూపించును. కాని

యిది మోక్షప్రాప్తియందు జ్ఞానాదిసాధనములఁ ద్రోసిరాజని యీ యుగమున వానికంటె నెట్లతిశయము కలదయినది?

**సూతు :–** శౌనకమునిపుంగవా ! శ్రీకృష్ణభగవానుఁడీ ధరా ధామమునువీడి, స్వీయ నిత్యధామమునకు వేంచేయు నప్పుడుద్ధవుఁడు భగవానుని ముఖారవిందమునుండి వెడలిన మకరండ మయిన యేకాదశస్కంధము నందలి జ్ఞానోపదేశమును వినియు నిట్లని యడిగెను.

**ఉద్ధవుఁడు :–** గోవిందా ! దేవరవారిప్పుడు భక్తికార్యముల నిర్వర్తించి పరమధామమునకు వేంచేయ సంకల్పించి తిరి; కాని మననమున నొక పెనుదిగులు పడినది. అదివిని దేవర వారు దాసునిశాంతుని జేయవలెను. కటాక్షింపుఁడు ! యిప్పుడు ఘోరమగు కాలికాలము దాఁపురమయినది. దీని మూలమున మరలఁ బ్రపంచమున ననేకులు దుష్టులు ప్రబలగలరు. వారి సంసర్గమునఁ బెక్కురుసత్పురుషులును నుగ్ర ప్రకృతి గలవారు కాఁగలరు. అంత వారి భారమునఁ గ్రుంగిపోయి గోరూపధారిణి యగు నీ పృథివి నెవరి శరణు చొఱఁగలదు? కమల నయన ! నాకో, దేవరవారుగాక దీని రక్షించుదక్షులు మఱెవ్వరు గానరాలేదు. కావున నోభక్తవత్సల ! సాధువుల మీఁదఁ గృపయుంచి దేవరవారిందుండి పోవలదు. భగవానుఁడా ! దేవరవారు నిరాకారులు చిన్మాత్రులునయ్యు. భక్తులకొఱకు సగుణరూపధారివగు చుందురు. మరి, భళా ! దేవర వారి వియోగమున నాభక్తులెట్టు లీసంసారమున నిలువగలరు? నిర్గుణో పాసనమందో యెంతో కష్టము గలదు. అది వారి వలన నయ్యేడి కార్యము కాదు. కావున నా విన్నపమును గుఱించి దేవరచిత్తమునం దొకించుక విచారమొనరింపుఁడు.

ప్రభాసక్షేత్రమున నుద్ధవుఁడు విన్నవించిన యీవార్తను విని భగవానుఁడు భక్తులకొఱకు నేనేమి వ్యవస్థ చేయఁదగునని విచారించి యంతట తనశక్తి యంతయు, శ్రీభాగవతము నందుంచి తా నంతర్థానుఁ డయి, యీ భాగవతసాగరమునఁ బ్రవేశించెను. కావున నిది భగవానుని సాక్షాచ్ఛబ్దమయ మూర్తి. దీనిని సేవించిన, శ్రవణముగావించిన, పాఠ మొనరించిన, లేదా దర్శించినమాత్రముననే మనుష్యుని పాపమంతయు నంతమగును. ఇందుచే దీని సప్తాహశ్రవణ మన్నిటికంటె నధికమయినదిగా నెంచఁ బడుచున్నది. కలియుగమునఁ దక్కిన యితరసాధనము లన్నిటినివిడిచి. యిదియే ప్రధానమయినదిగాఁ దెలుపఁబడినది. కలికాలమున నిదియే, దుఃఖమును, దారిద్ర్యమును దౌర్భాగ్యమును, దైన్యమును, బాపములను దుడిచి పెట్టఁజాలిన ధర్మము. కామక్రోధాది శత్రువుల గెలువఁజాలిన నుపమ యిదియే. కాకున్నచో, భగవంతుని యీ మాయను గడకుద్రోవ, దేవతలకును దరముగాదు. ఇఁక మనుష్యులెట్లు దీని నిర్జింపఁగలరు? ఆకారణమున దీనినుండి తప్పించుకొనుటకు సప్తాహశ్రవణ విధానమేర్పఱుపఁ బడినది.

**సూతుఁడు :–** శౌనకమునీంద్రా ! సనకాదిమునీశ్వరు లీ ప్రకారము సప్తాహశ్రవణమును వ్యాఖ్యానముచేసిన సమయమున, నాసభలో నొక మహాద్భుతము పొడమెను. దానిని నేను మీకు వినిచెద, వినుఁడు. అక్కడ కకస్మాత్తుగాఁ దరుణావస్థను బొందిన తన యిద్దఱుకొడుకులను వెంటఁబెట్టుకొని విశుద్ధ ప్రేమస్వరూపిణియగు భక్తి మాటిమాటికి "శ్రీకృష్ణ ! గోవింద ! హరే ! మురారే ! హేనాథ ! నారాయణ! వాసుదేవ ! యనునవి మున్నుగా భగవన్నామముల నుచ్చారణచేయుచుఁ బ్రత్యక్షమయ్యెను. ఆ సభ యందున్న వారందఱు భాగవత పరమతత్త్వము, శ్రీభగవానుని కంఠహారము, నగు సుందరవేషధారిణి, భక్తిరాణి విచ్చేయుటగని యబ్బురపడి యీమునుల సభలోని కీమె యెట్లు వచ్చెనని యోజింపఁజాగిరి. అంతసనకాదులు ఈ భక్తిదేవి కథాప్రభావముచేతనే యిక్కడఁ బ్రకటమయినదని చెప్పిరి. వారి యీ వచనముల నాలించి, భక్తి తనపుత్రులతోఁగూడి యత్యంత వినమ్రురాలయి సనత్కుమారునితో భక్తి "కలియుగమున నేను నష్టప్రాయనైతిని. తాము కథామృతముతో నన్ను దడిపి మరలఁ బురికొనఁ జేసితిరి. తాము నన్నిప్పుడెక్కడ నుండుమని నియమించెదరు?" అని యడుగ సనకాదు లామాటలు విని 'యా భక్తితో, నీవు భక్తులకు భగవత్స్వరూప ప్రదానము చేయుదానవు. అనన్య ప్రేమసంపాదన మొనరించుదానవు, సంసారరోగమును నిర్మూలముగావించుదానవు. కావున నీవు ధైర్యమునూని నిత్యము నిరంతరము విష్ణుభక్తుల హృదయమున నివాసము చేయుచుండుము. ఈ కలియుగదోషము తనప్రభావము సర్వప్రపంచముపైఁ బఱపెనుగాని యందు నీమీఁద వీనిదృష్టియైనను పడఁజాలదు.' అని యీ ప్రకారము వారి యాజ్ఞను బొంది, భక్తి వెంటనె భగవద్భక్తుల హృదయమునందుఁ జేరి విరాజమానమయ్యెను. శౌనికమునినాథా ! ఎవరిహృదయమున శ్రీహరిభక్తియొకటి మాత్రము నివాసము చేయునో, వారు శుష్కదరిద్రులయినను ముజ్జగములందు మిగులధన్యులు. ఏలననఁగా నీ భక్తి పాశబద్ధుఁడయి శ్రీహరియుఁ దన శ్రీవైకుంఠధామమును విడిచి, వారిహృదయములందు స్థిర నివాసము చేయును. భూలోకమున నీ భాగవతము సాక్షాత్తుపరమాత్మ విగ్రహము. మేము దీనిమహిమ నెంతని వర్ణింపఁ గలము. దీనినాశ్రయించి, దీనిని వినిపించుటచేతనో, విన్నవారు వినిపించినవారు వీరుభయులు శ్రీకృష్ణభగవానుని సామ్యమును బొందఁగలరు. కాన దీనిని విడిచి యన్యధర్మములతో నేమి ప్రయోజనము?

# చతుర్థాధ్యాయము

కథలో భగవానుని ప్రాదుర్భావము, గోకర్ణోపాఖ్యాన ప్రారంభము.

**సూతుఁడు :-** మునివరా ! యీ సమయమున తన భక్తుల హృదయములం దలౌకికభక్తి ప్రాదుర్భవించుటచూచి, భక్తవత్సలుఁడగు భగవానుఁడు తన శ్రీవైకుంఠధామమును విడిచి యక్కడకు వేంచేసెను. ఆ ప్రభుని మంగళసీమ వనమాల శోభిలుచుండెను. తిరుమేను సజలజలధరసమానమయి శ్యామసుందరమయి యొప్పులకుప్ప యయి యుండెను. అందుపై మనోహరి పీతాంబరమును సుశోభితమయియుండెను. కటిప్రదేశమునఁ గాంచీగుణము వింతశోభగురియుచుండెను – శిరమున వెలయు గిరీటముఠీవి వర్ణనాతీతము – కర్ణముల ధగధగ మెఱయు మణిమయ మనోహర మకరకుండలముల శోభకు వెల యెక్కడిది? పరమవిరాగుల సమాధి భంగమొనరించి చిత్తమును హరించుచుండెను – వక్షస్థలమునఁ గౌస్తుభమణి మెఱుగులీనుచుండెను. శ్రీయంగమంతయుఁ జందనచర్చితమయి యుండెను. ఆరూప శోభ నేమని చెప్పుదును – అయ్యది శతకోటి కామదేవుల రూపమాధురిని మురలీధరుఁ డిట్టి యనుపమ కాంతితోఁ దన భక్తుల నిర్మలచిత్తములం దావిర్భవించెను – భగవానుని నిత్యవిభూతి నివాసులయి భగవల్లీలా పరికరభూతులయిన యుద్ధవాదులు గుప్తరూపమునఁ గథ వినుటకయి వేంచేసియుండిరి – ప్రభువు సాక్షాత్కరించినంతన, నలువంకల జయజయధ్వనులు చెలరేగెను – ఆ సమయమున నద్భుతభక్తిరసప్రవాహము వెల్లివిరిసెను – మాటిమాటికిఁ బుష్పవృష్టియు శంఖారవములు విస్తరిల్లెను – ఆసభయందున్న వారు, తమ దేహగేహములనన నేల. తమ యాత్మను సర్వమును మఱచి తన్మయులయియుండి – వారి యా యవస్థను దిలకించి శ్రీనారదులిట్లనిరి. నేఁడు నేనిందు సప్తాహ శ్రవణము యొక్కయు లౌకిక మహాద్భుతమహిమను గంటిని. నేఁడిందుఁ జేరిన వారిలో వజ్రమూర్ఖులు, దుష్టులు, పశువులు, పక్షులును గలవు. వీరందఱత్యంతయు నిష్పాపులయిరి. ఈ కలికాలమునఁ జత్తశుద్ధికయి, పాపపుంజ నాశకరమయిన భాగవతకథకు సమాన మయిన దీమర్త్యలోకమున భాగవత కథకు సమానమయిన దీమర్త్యలోకమున వేఱొక పవిత్రసాధన మితరము లేదనుట నిస్సందేహము. మునివరులారా ! తామత్యంత కృపాలురు. తాము లోకకళ్యాణమునాశించి యీసరళసుగమ పరమ సాధనమును జూపితిరి. తాము కృపయుంచి యీ కథారూప సప్తాహయజ్ఞమున నెవరెవరు పవిత్రు లయ్యెదరో తెలుపుఁడు. అన్నపుడు సనకాదు లిట్లనిరి.

సదా వివిధములగు పాపములు చేయుచుండు వారును, నిరంతరము దురాచారపరాయణు లయి యుండువారును, విపరీత మార్గవర్తులయినవారు, క్రోధాగ్నితప్తులును, గుటిలులు, కామాసక్తులును, వీరందఱు కలియుగమున సప్తాహయజ్ఞముచేఁ బవిత్రులయ్యెదరు. సత్యమును విడిచినవారును, తల్లిదండ్రుల నిందించు వారలును, పేరాసకు లోనయి వికల చిత్తులయినవారును, ఆశ్రమధర్మముల వదలినవారును, దంభాచారులును, ఇతరుల యున్నతి కులుకువారలును, పరులకు దుఃఖము గలిగించువారును, కలియుగమున వీరెల్లరు సప్తాహ యజ్ఞముచేఁ బవిత్రులుకాఁగలరు. కల్లుద్రావువారును, బ్రహ్మహత్య చేయువారును, బంగారు దొంగిలించువారును, గురుదారాగమన మొనరించువారును, నమ్మినవారిని, జెఱుచువారును వీరు పంచమహాపాతకులు, కపట వర్తనులు, క్రూరులును, పిశాచములట్లు నిర్దయులును బ్రాహ్మణధనముచేఁ బుష్టినొందువారును వ్యభిచారులును వీరుగూడఁ గలియుగమున సప్తాహయజ్ఞముచేఁ బావనులయ్యెదరు. పట్టుదలతో మనోవాక్కాయములచే సర్వదా పాపము చేయుదుష్టుఁడును, పరులధనముచేఁ బుష్టి గనువాఁడును, మలినమనస్కుఁడును, దుష్టహృదయుఁడును కలియుగమున సప్తాహ యజ్ఞముచేఁ బావను లయ్యెదరు. నారదా ! యిప్పుడు మే విన్నమాత్రమున నొక ప్రాచీనేతి హాసము వినిచెదము. దాని విన్నమాత్రముననే సర్వపాపములు నశించిపోవును. పూర్వకాలమునఁ దుంగభద్రానది యొడ్డున నొక సుందరనగరముండెను. అందున్నవారందఱు తమతమ వర్ణాశ్రమ ధర్మముల నాచరించుచు సత్యమునందు సత్కర్మములందుఁ దత్పరులయియుండిరి. ఆనగరమున సమస్త వేదవిశేషము లెఱిఁగినవాఁడును, శ్రౌతస్మార్తకర్మములందు నిపుణుఁడును, నాత్మదేవుఁడను పేరుగల బ్రాహ్మణుఁడొకఁ డుండెను. తేజస్సున రెండవమార్తండుఁడు. భిక్షాటనముచేసి జీవించువాఁడే యయినను లోకమునఁ గొంతడబ్బు గలవాఁడని వాడుక. ఆ విప్రుని ప్రియభార్య దుంధులియను పేరుగలది. ఎల్లప్పుడు తనమాట నెగ్గవలెననెడి పట్టుదలకలది. సత్కులమునఁ బుట్టినది. చక్కనిది. లోకవార్తారతురాలు; స్వభావమునఁ గొంతక్రూరురాలు; వదరుబోతు; గృహకృత్యముల నిపుణురాలు; కలవాప్రియ; కృపణబుద్ధిగలది; ఇన్నియుండినను భార్యాభర్తలు పరస్పరాను రాగము గలిగి యానందముగఁ గాలము గడుపుచుండిరి. వారికి ధనమునకుఁగాని, భోగసామగ్రికిఁ గాని కొఱఁతలేదు. కాని వారికికొకటియేలోటు. ఒకమగ నలుసుగాని యాఁడుబిడ్డగానిలేదు. సంతానములేని కారణమున నిన్నియుండియును వారికి సర్వమును శూన్యముగాఁ దోఁచుచుండెను. వారికేదియు సుఖముగాఁ

దోఁపకుండెను. వారికి వయస్సుదాఁటిపోవుటఁగాంచి, వారు సంతానము కొఱకు వివిధములగు పుణ్యకర్మములు చేయఁసాగిరి. వారు పేదసాదులకు, గోవులను, భూమి, హిరణ్యము, వస్త్రములు మున్నగునవి దానముచేసిరి. ఇట్లు ధర్మమార్గమున వారు తమకున్న ధనములో సగము వెచ్చించిరి. ఇంతచేసినను వీరికి సంతతి కలిగినది కాదు. ఆ కారణమున నాబ్రాహ్మణుఁడత్యంత చింతాతురుడుఁ కాఁజొచ్చెను.

ఒకరిదినమున నా భూసురోత్తముఁడు మిగుల దుఃఖమునొంది, యిల్లువెడలి, యడవికిఁ బోయెను. మట్టమధ్యాహ్నమయినది. మిగుల డప్పిగొని, యొక చెఱువు దగ్గఱకుఁ బోయెను. బిడ్డలు లేకపోయిరనెడి దిగులుచే నాతని శరీరము మిగుల శుష్కించిపోయెను. అందువలన నలసి యచ్చోట నీరుత్రావి కూర్చుండెను. రెండుజాములు దాఁటినపిమ్మట నక్కడ కొక మహాత్ముఁడగు సన్న్యాసి విచ్చేసెను. ఆ సన్న్యాసి జలము గ్రోలి దాహశాంతిచేసికొనినది చూచి యా బ్రాహ్మణుఁ డా యతికడకుఁ బోయి, నమస్కరించి వేఁడి నిట్టూర్పులు వచ్చుచు, నిలఁబడియుండెను.

**సన్న్యాసి :–** చెప్పు – బ్రాహ్మణుఁడా ఏడ్చెదవేల? నీ కింత దురంతచింత యేమికారణమునఁ గలిగినది? తతక్షణమ నీ దుఃఖమునకు గారణమును దెలుపుము?

**బ్రాహ్మణుఁడు :–** మునిచంద్రమా ! నా దుఃఖ మేమని చెప్పుదును? ఇదంతయు నేను బూర్వమునఁ జేసిన పాప ఫలము. నా కెట్టిసంతానము లేదు. అందుచే నేను నా పితృ దేవతల కొసఁగెడి తిలోదకము దుఃఖమువలన వచ్చెడి వేఁడి నిట్టూర్పులచే సలసల మఱుగుచున్నవి. దేవతలకు, బ్రహ్మణులకు నే నేమిచ్చినను సంతోషముతో గ్రహింపకున్నారు; బిడ్డలు లేరనెడి దుఃఖముచే నాకు సర్వము శూన్యముగానే తోఁచుచున్నది. అందువలన నిప్పు డిక్కడఁ బ్రాణములు విడువ వచ్చితిని. సంతతిలేని జన్మమేటికి? ఛీ కాల్పనా? ఎవని భవనమున నల్లారుముద్దుగా నాడుచుండు బిడ్డలు లేరో యది వనమే, సంబాళించుకొనిపోవు ఉత్తరాధికారి లేనివాని ధనము దంధనముకాక మఱేమి? సంతానము లేనివాని కులము ఛీ ఛీ ఏమి ప్రయోజనము? నేను పెంచెడి గోవు కట్టదు; ఈనదు. ఎప్పుడు చూచినను గొడ్డుబోతుఁగానే యుండును. నేను వేసిపెంచిన చెట్టొకప్పుడు పూచి కాచుటలేదు. అంతదూరము పోనేల? నాయింటికిఁ దెచ్చిన పండో కాయయో తతక్షణమ కుళ్ళిపోవును. నే నిట్టి దౌర్భాగ్యుడనయి సంతాన హీనుఁడనయిన పిమ్మట భూమి మీఁద బ్రతికి ఫలమేమి? చెప్పుఁడు.

అని యీ ప్రకారము చెప్పి దుఃఖాకులుఁడయి యా బ్రాహ్మణుఁడు సన్న్యాసి మ్రోల వెక్కివెక్కి యేడువఁ జొచ్చెను. అది గని యాయతి హృదయము నీరయ్యెను. అతఁడు యోగనిష్ఠుఁడు కావున నా భూసురుని లలాట రేఖలఁ బరికించి, సర్వమును దెలిసికొని, యావిప్రవరునితో సర్వమును విస్తరించి వచింపఁ బూనెను.

**సన్న్యాసి :–** బ్రాహ్మణుఁడా ! నీ వీ సంతానముకొఱకయిన భ్రమను విడువుము. చూచితివా ? కర్మగతి బలవత్తర మయినది. నీవు వివేకముగలిగి, సంసారవాసనను వదలి వేయుము. విప్రపుంగవా ! విను. ఇప్పుడు నీప్రారబ్ధమును జూచితిని. ఇది నిశ్చయము. నీకేడు జన్మములవఱకును ఏ ప్రకారముగను ఎట్టిసంతానమును గలుగనేరదు. కావున నీ వీ కుటుంబము మీఁది మమత్వమును విడుపుము. త్యాగము నందు, సర్వవిధముల సుఖమే తప్ప వేఱొకటిలేదు. ఈ సంతాన మనెడి మాయలోఁ దగుల్కొని యేమి సుఖము పడియఁ గలవు? పూర్వకాలమున నగరచక్రవర్తి, అంగరాజుమున్నగువా రీసంతానముమూలమున నెంతెంతయాతన లనుభవించిరో చూడలేదా?

**బ్రాహ్మణుఁడు :–** మహాత్మా ! నాకు వివేకముతో నేమి పని? అది మీవంటివారికిఁ దగును. నాకో యొకపుత్రు నను గ్రహింపుఁడు. పుత్రకళత్రాదిక సుఖములేని యీ సన్న్యాసము సర్వథా నీరసమయినది. పుత్రపౌత్రాదులతో నిండిన గృహస్థాశ్రమమే సరసమయినది.

బ్రాహ్మణుని యీ పట్టుదలఁ జూచి, యా తపోధనుఁడు విధాతవ్రాఁత తప్పింప హతముగావించిన చిత్ర కేతుఁడను నరపాలుఁడు మిగులఁ గష్టముపాలు గావలసి వచ్చెను. దైవమనుకూలింపని పురుష ప్రయత్నము వ్యర్థము. నీకును బుత్రునివలనఁ సుఖము లభింపఁజాలదు. కాని యేమందును? నీవో మొండిపట్టు పట్టినావు నిన్నెట్లు కాదందును?

ఆ మహాత్ముఁడా పాఱుఁ డేవిధముగను దన పట్టుదల విడువకుండుట చూచి, వానికొక ఫలము దీనిని నీ భార్యకిచ్చి యామె తినునట్లు చేయుము. ఆమెకొక పుత్రుఁడు కలుగ గలఁడు. నీ భార్యయొక సంవత్సరము వఱకు, సత్యము శౌచము, దయ, దానము, ఒంటిపూఁట భోజనము నియమముగఁ బాటింపవలెను. ఆమె యట్లుగావించెనేని, బాలకుఁడు మిగుల శుద్ధమగు స్వభావము గలవాఁడు కలుగఁగలఁడు.

అని యీమాదిరిగాఁ జెప్పి యోగిరాజు వెడలిపోయెను. బ్రాహ్మణుఁడు తన యింటికిఁ బోయెను. తన గృహమునకేగి యాద్విజుఁడు తాను తెచ్చిన ఫలమును తనయిల్లాలి చేతికిచ్చి తానెందోపోయెను. అతని భార్య

వక్రస్వభావముకలది కావున నేడ్చుచుఁబోయి దాని సాహసకత్తె నొకర్తుకను జూచి ఇట్లని చెప్పసాగెను. 'సఖీ! నాకెంతో దిగులు వేయుచున్నాదే? నేనీపండు తినలేనమ్మా ! చూడు ! యీపండు తింటివా వేఁకటివచ్చును. గర్భము నిలిచిన కడుపు పెద్దదగును? తర్వాత నేమియుఁ దినను ద్రాగను వీలుపడదు. అటులయిన సంసారము జరగుటెట్లే? భగవత్కృపచే లేదుగాని, యొక వేళగ్రామములో బందిపోటు దొంగల హడావిడి కలిగిన, గర్భిణి గానున్న యాఁడుది పాఱిపోవుటెట్లు? ఇట్లుగాక శుకునివలె. నీ గర్భములోఁ బిండము (పంద్రెండేఁడులుం)డిన, ఈగండము గడచి పిండము బయట పడుటెట్లు? మఱియు ప్రసవసమయమున లోపలి శిశు వడ్డము తిరిగిన, ప్రాణము మీఁదికిరాదా? పోనీ, సహజముగానే ప్రసవించుట సంభవించినను, ప్రసవవేదన మతిభయంకరమయి నది కదా! నేనో బహుసుకుమారిని యీ బాధనెట్లు సహింపఁగలను? ఆసమయమున నేనో యొకటి చేయుటకులేదు. చూచుటకులేదు. అట్లుండ వాఁడు బిడ్డవచ్చి యింటిలోనిదంతయుఁ దోఁచుకొని పోవఁగలదు. అమ్మయ్యో ! నేనేమి, ఆ సత్యము శౌచము మున్నగు నియమములు సంవత్సరము దాఁక జరుపుటేమి, నావలన నయ్యెడి పనికాదు. నెత్తిమీఁదఁ బడఁగలదు? కావున గొడ్రాలో, విధవయో యయిన స్త్రీ హాయిగా సుఖపడఁగలదని నాయభిప్రాయము.

నారదా? యీరీతిగా నాదుంధులి మనస్సున, వివిధములయిన కుతర్కపరంపరలు బయలు దేఱుటచే నాఫలమును దిననదికాదు. పెనిమిటి 'పండు తింటివా?' యని యడుగ 'ఆఁ ! తింటిని' అని యతినితో బొంకెను. ఒకనాఁడెందుకో తనంతన నాదుంధులి చెల్లెలింటికి రాఁగా, నామెతో నీవృత్తాంతమంతయు జెప్పి 'చెల్లెలా ! సంతానము కలుగకున్న, మీ బావ గారేమి చేయుదురో వారికేమి చెప్పుదునా యని భయమగుచున్నది. ఈ విచారముచే దినదినము కృశించిపోవుచున్నాను. డబ్బెత్తు సత్తువలేదు. ఏమిచేయుదును? చెప్పు' మనియన, నప్పుడా సోదరీ ! 'అక్కా ! ఏలనే భయపడెదవు? నాగర్భమున బిడ్డయున్నది. ప్రసవముకాఁగానే, యాబాలకుని నీకిచ్చెదను. అంతదనుక నీవు కడుపుతో నున్న దానివలె నింటిలో గోప్యముగా నటింపుము. మీమఱఁది కేదో కొంత చేయితడి చేసితివా, యాయన యూరకుండఁగలడు. మేమొక యుక్తి పన్నెదము. మాకుఁ బుట్టినబిడ్డ బదునాఱు నెలలయిన తరువాత జనిపోయినాఁడని లోకులను కొనునట్లు చేసెదము. నేను మీ యింటికి వచ్చి యా పిల్లవానికి నిత్యము పాలిచ్చి పోషించెదను. పరీక్షార్థమిప్పుడు ఫల మావునకుఁ బెట్టుమని చెప్ప నా బ్రాహ్మణ స్త్రీ స్వభావముచే 'నేమి యనక' తన చెల్లెలు చెప్పినట్లే చేసెను.

తరువాత, సమయానుసార మాదుంధులి చెల్లెలు ప్రసవింపఁగానే యానవజాత శిశువును గప్‌చిప్‌గా జనకుఁడు తీసికొని వచ్చి దుంధులికిచ్చి పోయెను. ఆమె తాను సుఖముగా కొడుకును గంటినని తన పతియగు నాత్మదేవున కెఱిఁగించెను. ఈ ప్రకార మాత్మదేవునకుఁ బుత్రుఁడు కలుగుటవిని యెల్లవారలానందించిరి. అప్పు డా బ్రాహ్మణుఁ డా శిశువునకు జాత సంస్కా రము చేసి, బ్రాహ్మణులకు దానము లిచ్చెను. ఆ యాత్మ దేవున గృహద్వారమున మేళతాళము లాటపాటలు మున్నగు వేడుకలు మాంగలిక కృత్యములు జరిగెను. అంద దుంధులి పతితోఁ 'నాఱొమ్ములలో పాలుపడలేదు. ఈ బిడ్డకు ఆవు మున్నగు నితరజీవుల వలనఁ బోఁత పాలు పోసి యెట్లు పోషింపగలను. నాచెల్లెలికి మగపిల్లవాఁడు పుట్టి వాఁడు చనిపోయినాఁడు. ఆమెను బిలుచుకొని వచ్చి యిక్క డ నుంచు కొంటిమా యే దిగులు లేకుండ బిడ్డను సర్వవిధముల నామె పోషణము చేయఁగలదు' అని చెప్పఁగా, నాతఁడు 'మంచి'దని తన పిల్లవానిపోషణ కామెను, తన భార్య చెప్పినట్లే తీసికొని వచ్చి తన యింటిలో నుంచెను. ఆ బిడ్డకు దుంధులి దుంధుకారి యని పేరిడెను.

మూఁడు నెలలు గడచిన పిమ్మట యాగోమాత కొక మనుష్యాకరముగలవత్స కలిగెను. ఆ బిడ్డఁడు సర్వాంగ సుందరుఁడు. దివ్యమయి నిర్మలమయి సువర్ణమువంటి కాంతి గలవాఁడు. ఆ శిశువును జూచి యాత్మదేవుఁ డానందసాగరమున మునిఁగితానే యాశిశువునకు సర్వసంస్కా రములు గావించెను. ఈ సమాచారము విని, లోకులందఱు మిగుల నాశ్చర్యమునుబొంది, యా బాలకునిఁ జూడ వచ్చిరి. చూచి తమలోఁ దాము 'యీ యాత్మదేవుఁ డెంత యదృష్టవంతుఁడు? ఎంతవింత? ఈతని యావుకూడ నిట్టి దివ్యరూపముగల బాలకునిఁ గన్నది' అనుకొనఁసాగిరి. దైవయోగమున ఈ పరమ రహస్య మెవరికిని దెలిసినది కాదు. ఆత్మదేవుఁ డా బాలకుని కావువంటి చెవులుండుటగని గోకర్ణుఁడని నామకరణముచేసెను.

కొంతకాలమున పిమ్మట నా బాలకులిరువురు యౌవన లక్ష్మి వరించెను. వారిలో గోకర్ణుఁడు గొప్ప పండితుఁడు, జ్ఞాని యయ్యెను. కాని దుంధుకారి మిగుల దుష్టుఁడయ్యెను. స్నానశౌచాది బ్రాహ్మణోచితములగు నాచారములు పేరునకయిన వానియెడఁ గానరావు. ఆహార పానములయెడ మంచి సెబ్బరల విచారమే లేదాతనికి. క్రోధపర్వతమ స్తకుఁడతఁడు. దుష్పరిగ్రహమతనికి మంచినీళ్ళప్రాయము. పీనుఁగు మీఁది పిండమును తినుట కతఁడు జంకఁడు. పరధనదారహరణమునఁ బండితుఁడు. పరుల ద్వేషించుట వాని స్వభావము. దాఁగి

దాఁగి పరులకొంపల కగ్గి దాకొలుపును. పరుల బాలకుల నాడించుట కెత్తుకొనపోయి, జంకక బావులలోఁ బడవేయుచుండును. హింసచేయుటయే వానికి వ్యసనమయినది. వాఁడెల్లప్పు డస్త్రశాస్త్రముల ధరించితిరుగుచుండును. పాపము కుంటిగ్రుడ్డివాండ్రను, దీనులను దుఃఖభారపీడితులను రిత్తకు వేఁపికొని తినుచుండును. చండాలురన్నవానికి విశేషప్రేమ. చేతఁబాశములు పూని కుక్కల వెంటగొని సదావేఁటకై గ్రుమ్మరుచుండును. వేశ్యలవలలోఁ జిక్కి వాఁడు పితృ సంపత్తి నంతయు వ్యర్థముగాఁ బాడుచేసెను. ఒకనాఁడు తల్లిదండ్రులను జావమోఁది, కొంపలోని వస్తువుల నెల్ల నెత్తికొని పోయెను.

ఈ ప్రకారము సర్వసంపత్తి స్వాహా కాఁగా 'పాప మాతని తండ్రి వెక్కి వెక్కి యేడ్చుచు ఇంతకంటె వీని తల్లి గొడ్రాలయినను మేలుగా నుండెడిది. కుపుత్రుఁడు, అబ్బా ! మహత్తర దుఃఖములకు నిదానము. ఇప్పుడు నే నెక్క డ నుందును? ఎందుఁ జొత్తును? నా యీ సంకటమును బాపు పుణ్యాత్ములెవరు? అయ్యో ! నా నెత్తిన మహత్తరమగు విపత్తు వచ్చిపడినది. దీనిమూలమున నే నవశ్యము గొంతున కురిపోసికొని ప్రాణములను విడువవలసినదే' యని విచారపడుచుండ, నింతలో పరమజ్ఞానియగు గోకర్ణుఁ డక్క డకు వచ్చి, తన తండ్రికి వైరాగ్యము నుపదేశించుచు ననునయించెను. అప్పా ! నిజము నమ్ముఁడు – ఈ సంసారమున నించుకంతయు సారములేదు. ఇది యత్యంత దుఃఖరూపమయినది. మోహమున ముంచునది – బళా ! తనయులు ధనము, ఎప్పుడు ఎవనిది? వీనియందు మమత్వ మనెడి మాయలోఁ దగుల్కొ నినవాఁడు రాత్రి పగలు కుమిలిపోవలసినదే. ఇంద్రుఁడే కానీ ! చక్రవర్తియేకాని రామ రామ ! సుఖము లేశమయినను లేదు. సుఖమందురా ! ఏకాంతవాసియు విరక్తుఁడు నగు మునికొక్కనికే గలదు. మీరీపుత్ర స్నేహమనెడి యజ్ఞానమును విడువుఁడు. ఈ మోహమునఁ జిక్కి నవాఁడు, నరకముపాలు గావలసినవాఁడే; చివరకీ శరీరమో నష్టమైపోవలసినదే – కావున నిప్పుడే సమస్తమును విడిచి యడవికిఁ బొండు !

గోకర్ణుని హితవచనముల నాలించి, యాత్మదేవుఁడు వనమునకుఁ బోవ సన్నద్ధుఁడై, 'వానితోఁ నాయనా! అడవియందుండి నే నేమి చేయవలెను ? విస్తరించి నాకుఁ దెలుపుము. నేను వజ్రమూర్ఖుఁడను. ఇంతదనుక కర్మవశమున, స్నేహపాశ బద్ధుఁడనయి, పంగుక్రియ, యిల్లనెడి పాడుచీఁకటి నూతిలోఁ ద్రెళ్ళి కదలలేక పడియుంటిని. నీ వత్యంత దయాళుఁడవు. ఇందుండి నన్నుద్ధరింపుము' అని యడిగెను.

**గోకర్ణుఁడు :–** నాయనా ! ఈశీరర మెముకలు, మాంసము. నెత్తురుతోఁ గూడిన పిండము. దీనిని మీరు 'నేను' అనుకొనుట మానుఁడు – దారసుతాదులు 'నావా' రని యెంచకుఁడు; ఈ సంసార మహర్నిశము క్షణ భంగురముగాఁ జూడుఁడు. ఇందలి యేవస్తువును స్థాయికలదిగా, దలఁచి దానియందు రాగముకలవారు కావలదు. కేవలము వైరాగ్యరసరసికులయి, భగవానునియెడ భక్తిగలవారు కండు; భగవద్భజనమే నన్నిటికంటె ననుత్తమ పరమధర్మము. నిరంతరము దాని నాశ్రయింపుఁడు. తదితరములగు సమస్త లౌకికధర్మములనుండి విముఖులు కండు; సదా సాధుజనుల సేవింపుఁడు. భోగలాలస దగ్గఱకు రానీయక దూరముగఁ దఱిమి వేయుఁడు. తతక్షణమ, పరుల గుణదోషముల విచారముసేయుట మాని, యేక మాత్రమగు భగవత్సేవ, భగవత్క థారసములనే పానము చేయుఁడు.

ఈ ప్రకారము పుత్రుఁడు చెప్పుటచే, నాత్మదేవుఁ డరువది సంవత్సరముల వయస్సు గడచిన వాఁడయ్యును, స్థిరచిత్తముతో గృహమును విడిచి, వనమునకు వెడలిపోయెను. అచట రాత్రిం దినము భగవానుని సేవ, పూజచేయుచు, నియమపూర్వకముగ శ్రీమద్భాగవతమునందలి దశమస్కంధము పాఠముచేయుటచే, నాతఁడు శ్రీకృష్ణచంద్రభగవానుని నిత్యపదము బ్రాప్తించెను

# అయిదవ అధ్యాయము

## దుంధుకారికిఁ బ్రేతయోని ప్రాప్తి దాని విమోచనము

**సూతుఁడిట్లనియె :-** శౌనకమునీంద్రా ! జనకుఁడు వనమునకుఁ జనిన యనంతర మొకనాఁడు దుంధుకారి తనతల్లిని బట్టుకొని చెడబాది 'చూపు ! డబ్బు ఎక్కడ పెట్టినావో? లేదా యిదే యిప్పుడే నీపనిచెప్పెద' నని బెదిరింప, వాని యాగడమునుగని భయపడి, దుఃఖించి, యారాత్రివేళపోయి భావిలోదూఁకి ప్రాణములు విడిచెను. ఈ ప్రకారము తలిదండ్రులిరువురు లేకపోవుటచే, గోకర్ణుఁడు తీర్థయాత్రకై బయలుదేఱెను. అతఁడు యోగనిష్ఠుఁడు కావున నిట్టిఘటనల కతఁడు పొంగిన వాఁడుకాఁడు; క్రుంగినవాఁడు కాఁడు : ఏలనన, నాతని కెవఁడు మిత్రుఁడు లేఁడు, శత్రువు లేఁడు.

ఇప్పుడు, దుంధుకారి అయిదుగురు వేశ్యలతో నింటిలోనే యుండఁ జాగెను. వారికి భోగసామగ్రి సమకూర్పవలెననెడి విచారమతని బుద్ధిని నశింపఁజేయ, వాఁడు వివిధములగు క్రూరకర్మములు చేయఁ బూనెను. ఒకనాఁ డాకులటలు వానిని బెక్కు నగలు తెమ్మనియడిగిరి. వాఁడు కామాంధుఁడు. వానికి, మృత్యువు మాటయే మనస్సునకు రాకుండెను. సరి. వాఁడు వారు కోరిన సొమ్ములు సంపాదించి తెచ్చుటకుఁ గొంప నుండి బయలు దేఱిపోయి, యెక్క డెక్క డనో, విశేషధనమును ముచ్చిలి, మరల నింటికిఁజేరి, వారలకుఁ గొన్ని మేలీచీరెలు నగలు సమర్పించెను. ఇంటిలో దొంగసొత్తు చాలా యుండుటగని రాత్రివేళ నావెల వెలఁదులు 'వీఁడు నిత్యము దొంగతనము చేయుచున్నాఁడు. ఒకప్పుడు తప్పక పట్టుపడక మానఁడు. అంత యీ సొత్తంతయు రాజు హరించి తీఱును. నిజము వీనికి మరణదండనము తప్పదు. ఈ ప్రకారము వీఁడొకనాఁడు చావవలసినవాఁడే కాఁబట్టి రహస్యముగా వీనిని మనమేల మట్టుపెట్టరాదు. వీనిపని మనము ముగించితిమేని, యీ ధనమైన మనకు దక్కును. వీనిని జంపి యీ సొత్తంతయుఁ దీసికొని యెందేని లేచిపోవుద' మని యాలోచనచేసి వారు, నిద్రపోవుచున్న దుంధుకారిని, త్రాళ్ళతోఁ గాలుసేతులు బంధించి, గొంతునకురిపోసి, చంపఁ బ్రయత్నించిరి. దీనిచే వాఁడు చాపకుండుటచే, వారికిఁ జాలఁజింతకలిగెను. అంత వారు మండుచున్న నిప్పులు తెచ్చి వాని మొగము మీఁదఁ బోసిరి. ఆ నిప్పులచేమాడి వాని ప్రాణమెంతో కొట్టుకొని, యాశరీరమును విడచిపోయెను. తర్వాత వాని మృత కళేబరము నొకగోఁతిలోవేసి మన్నుకప్పిరి. వాస్తవమిట్టి కామినులు తఱుచుగ నెంతటి ఘోరకృత్యము చేయుటకు వెనుదీయని దుస్సాహసము కలవారుగా నందురు. వారీపని చేసిన జాడ యెవరికిని దెలియదు. లోకులెవరయిన నడిగిరేని 'మా ప్రియతముఁడు ధనాశచే నీసారి యెక్కడకో పోయి చాలకాలమయినది. బహుశా యీ సంవత్సరాది లోపలనే తిరిగి రావచ్చునని సమాధానము చెప్పుచుండిరి. బుద్ధిమంతుఁ డెప్పుడును దుష్టస్త్రీలను విశ్వసింపరాదు. వీరిని నమ్మిన మూర్ఖుఁడు, విపత్పరంపరా వాగురులఁ జిక్కి యవశ్యము దుర్గతి పాలుగాక మానఁడు. వీరిమాట లమృతమువలెఁ గాముకుల హృదయమున కింపుగూర్చునుగాని హృదయము పదునుగల చుఱకత్తి యంచువలె వాఁడికలదయి యుండును. బళా ! యీ స్త్రీల కెవఁడు ప్రియుఁడు'.

తదనంతర మావేశ్యలాదుంధుకారి సొత్తంతయుఁ దీసికొని గుడిసెమీఁద దెబ్బకొట్టి, యందుండి లేచిపోయిరి. వారికిట్టి మగ లెంతమంది యయిరో యేమిగుఱుతు? దుంధుకారి తాను జేసిన కుకృత్యములచే భయంకరమగు ప్రేత యయ్యెను. వాఁడు సుడిగాలి రూపమున దశదిశలు ద్రిమ్మరుచు శీతాతపములకుఁ గ్రాఁగి, యాకలిదప్పుల కటమటించుచు 'అయ్యో ! దేవుడా ! అయ్యో దేవుఁడా ! యని యఱచుచుండెను. కాని వానికెందును నెట్టి యాశ్రయమును జిక్కి నదికాదు. కొంతకాలము గడచిన పిమ్మట, గోకర్ణుఁడు దుంధుకారి చంపఁబడినవార్త. లోకుల వలనఁ దెలిసి, వాఁడు దిక్కు మాలిన వాఁడగుట యోజించి, గయకుఁబోయి వానికి శ్రాద్ధము పెట్టెను. తా నెక్క డెక్క డకుఁ బోయెనో యక్క డక్క డ వానికై శ్రాద్ధక్రియలు చేయుచుండెను.

ఈ ప్రకారము గోకర్ణుఁడు తీర్థయాత్రల సేవించి తిరిగి తన నగరమునకు వచ్చి, యెవరికిఁ గానరాకుండ రాత్రివేళ సూటిగాఁ బోయి తనయింటి ముంగిలిలోఁ బరుండఁబోయెను. అక్క డ తనసోదరుఁడు పరుండుట చూచి యర్ధరాత్రివేళ దుంధుకారి, యత్యంత వికటరూపముతోఁ గానవచ్చెను. వాఁ డొకప్పుడు గోదురుకప్పవలెను, నొకసారి యేనుఁగువలెను, నొకతడవ దున్నవలెను, ఒక పరి యింద్రునివలెను, ఒకమాఱు అగ్నివలెను గనఁబడెను. తుదకు వాఁడు మనుష్యాకారమునఁ దోఁచెను. ఈ విపరీతావస్థలను దిలకించి, గోకర్ణుఁ డిది యేదో దుర్గతిపాలయిన జీవియని గ్రహించెను. ఇట్లు నిశ్చయపఱుచుకొని గోకర్ణుఁడు ధైర్యముతో వాని నిట్లని యడిగెను.

ఏమి అన్నా ! నీ వెవఁడవు? రాత్రి సమయమున నిట్టి భయానకరూపముల నేల చూపుచుంటివి ? నీ కీ దశ యెట్లు గలిగినది? మాకుఁ జెప్పు. నీవు ప్రేతవా? పిశాచివా ! లేక యెవఁడ వయిన రాక్షసుఁడవా? యని

గోకర్ణుఁ డడిగెను.

**సూతుఁ డిట్లనియె :–** గోకర్ణు డీప్రకారమడుగ, వాఁడు మాటిమటికి భోరున నేడువఁజొగెను. వానికి మాటలాడ శక్తి లేదయ్యెను. ఆకారణమున కేవలము సైగలు చేయఁగా గోకర్ణుఁడు దోసిటిలో జలముతీసికొని నభిమంత్రించి వానిమీఁదఁ జల్లెను. దీనిచే వానికిఁ బాపమొకింత శమనమయి వాఁ డీప్రకారము చెప్పఁదొడగెను

**ప్రేత :–** నేను నీ సోదరుఁడనగు దుంధుకారిని. నేను స్వయంకృతాపరాధము చేతనే నా బ్రహ్మణత్వమును బోఁగొట్టుకొంటిని. నేను జేసిన దుష్కృత్యముల లెక్కి ంప నెవరితరము? నేనో మహత్తరమగు నజ్ఞానమున మునిఁగిపోతిని. ఆ కారణమున నేను లోకులను జాల హింసపెట్టితిని. అంతమునఁ గులటలగు చెడిపెల చేతులలోఁ జిక్కి దుర్మరణము పాలయితిని. ఆకారణమున నిప్పుడు ప్రేతయోని యందుఁబడి యీ దుర్దశ ననుభవింపవలసిన వాఁడనయితిని. ఇప్పుడు దైవాధీనమున, కర్మఫలో దయమగుటచే, నేను గేవల వాయుభక్షణచే జీవించుచున్నాను. అన్నా ! నీవు దయాసముద్రుఁడవు. ఇప్పుడే ప్రకారముగ నయిన వెంటనే నన్నీ ప్రేతయోనినుండి ముక్తునిఁ జేయుము అని గోడు గోడున నేడ్చెను.

అప్పుడు గోకర్ణుఁడు దుంధుకారి వృత్తాంతమంతయు విని వానితో నిట్లనియె.

**గోకర్ణుఁడు :–** అన్నా ! ఇది యెంతో వింతగానున్నది; నేను నీకొఱకు విధిపూర్వకముగ గయలో పిండప్రదానము చేసితిని. అట్లుచేసినను నీవు ప్రేతయోనినుండి యేలముక్తుఁడవు కావైతివి? గయాశ్రాద్ధము చేతను నీకు ముక్తి కలుగనిచో, నిఁక దీనికేమి యుపాయము లేదు. మంచిది ! నీ నిప్పు దరవిడిచి చెప్పు ! నన్నేమి చేయమనెదవు ?

**ప్రేత :–** సోదరా ! నాముక్తి నూఱు గయాశ్రాద్ధము లొనరించినను నగునది కాదు. ఇప్పుడో, నీవుదీని కేదేని వేఱొక యుపాయ మాలోచింపుము.

ప్రేత యాడిన యామాటల నాలించి, గోకర్ణుఁ డాశ్చర్య చకితుఁడయి, నూఱు గయాశ్రాద్ధములవలనను నీకు ముక్తి కలుగదేని, యిఁకనీకు ముక్తి యసంభవమే – మంచిది. ఇఁక నిర్భయుఁడవై నీవు నీ స్థానమున నుండుము. నేను విచారించి, నీ ముక్తికొఱకు వేఱొకయుపాయము చేసెదను అని చెప్పెను.

గోకర్ణుని యాజ్ఞ ప్రకారము దుంధుకారి యందుండి తన స్థానమునకు వెడలిపోయెను. ఇక్క ట గోకర్ణుఁడు రాత్రి యంతయు నాలోచించుచునే యుండెను గాని యతని కేమియు నుపాయము తోఁచినదికాదు. ప్రాతఃకాలము కాగానే, యాతఁడు వచ్చిన సమాచారము లోకులకుఁ దెలిసి, ప్రేమ వశులయి, యతనిని జూడ నెల్లరువచ్చిరి. అప్పుడు గోకర్ణుఁ డా రాత్రి జరిగిన వృత్తాంతమంతయు వారలకు వినిపించెను. ఆ వచ్చినవారిలో, విద్వాంసులు, యోగనిష్ఠులు, జ్ఞానులు, వేదజ్ఞులు గలరు. వారును బెక్కు శాస్త్రములు పరిశోధించిరి కాని వారికిని దుంధుకారికి ముక్తి యెట్లు లభించునది యుపాయము దొరికినది కాదు. అంత వారందఱును 'సూర్యనారాయణ మూర్తి యీ విషయమునకే యేమి యాజ్ఞసేయునో యదియేచేయనగు' నని నిశ్చయము చేసికొనిరి. ఆ కారణమున గోకర్ణుఁడు తన తపోబలమున, సూర్యగమనము నడ్డగించి 'భగవానుఁడా ! నీవు సర్వలోక సాక్షివి. నేను నీకు నమస్కా రము చేయుచున్నాను. నీవు నాకు కృపచేసి దుంధుకారి ముక్తికి సాధనమును దెలుపు'మని ప్రార్థనచేసెను. అది విని సూర్యభగవానుఁడు దూరమందుండి, స్పష్టముగఁ దెలియనగు మాటలతో శ్రీమద్భాగవతమువలన ముక్తికలుగఁ గలదు. కావున దానికై 'నీవు సప్తాహపారాయణ మొనరింపు' మని చెప్పెను. సూర్యభగవానుఁ డానతిచ్చిన ధర్మమయమగు నీ సూక్తుల నక్క డ నున్నవారందఱు వినిరి. అప్పు డెల్లరును ప్రయత్న పూర్వకముగ దీనినే చేయుఁడు. కావుట కీసాధనము చాల సరళమయినది. అని యేక వాక్యముగఁ బలికిరి. అందుచే గోకర్ణుఁడును నదియే నిశ్చయించుకొని కథ వినిపించుటకు సన్నద్ధుఁడయ్యెను.

కథాసమాచారము నెఱిఁగి చుట్టుపట్టు దేశములనుండి గ్రామములనుండి యనేకులు వినుటకు రాఁ సాగిరి. పెక్కు రు పిచ్చుకుంటులు, గ్రుడ్డివారు, ముదుసలివారు, మందబుద్ధులును దమతమ పాపములు నివృత్తి చేసికొనవలెన నెడి యుద్దేశముతో నక్క డకు వచ్చిచేరిరి. ఈ ప్రకార మచ్చుట, దేవతలు చూచి యాశ్చర్య పడఁదగినగుంపు చేరినది. గోకర్ణుఁడు వ్యాసగద్దెపైఁ గూర్చుండి. కథ చెప్పఁబూనెను. అప్పుడు ప్రేతయును నక్క డకు వచ్చి, కూర్చుండుటకుఁ జోటు నచ్చటచ్చట వెదకఁ జొచ్చెను. ఇంతలో నేదు కణువులుగల వెదురొకటి సూటిగా దానిదృష్టిలోఁ బడెను. దాని యడుగున బెజ్జములోఁదూఱి. యాకథను వినుటకయి యందుఁ గూర్చుండెను. వాయు రూపమున నుండుటచే నది వెలుపల నెక్క డను గూర్చుండఁ జాలని కారణమున వెదురులోఁ దూఱెను.

గోకర్ణుఁ డొక వైష్ణవ బ్రాహ్మణుని ముఖ్యశ్రోతగా నియమించుకొని ప్రథమస్క ంధమునుండియే స్పష్టమయిన స్వరముతోఁ గథను వినిపింపఁ దొడఁగెను. సాయంకాలమునకుఁ గథ నిలుపఁగానే, యొక

వింత విషయము జరిగెను. అక్కడ సభాసదులు చూచుచు చూచుచు నుండఁగనే, వెదురు కణుపొకటి, పటపట యను ధ్వనితోఁ బగిలిపోయెను. ఈ ప్రకారము రెండవ దినము సాయంకాలము, మఱియొక కణుపు పగిలెను. మూఁడవనాఁడు మూడవకణువు ఈ విధముగా నేడవ దినమున నేడవకణువు పగిలి దుంధుకారి, ద్వాదశస్కంధములు వినుటచేఁ బవిత్రుఁడయి, ప్రేతయోనినుండి ముక్తుఁడయి దివ్యరూపమును ధరించి, యెల్లర సమక్షమునఁ బ్రకటమయ్యెను నీల మేఘమునకు సాటియయిన శ్యామశరీరము, పీతాంబరము. తులసీమాలలతో సుశోభితుఁడయి యుండెను. శిరమున మనోహరమకుటము, కర్ణములఁ గమనీయ కుండలములు ధగ ధగ మెఱయు చుండెను. వెంటనే వాఁడు తనసోదరుఁడగు గోకర్ణునకుఁ బ్రణామ మొనరించి ‘అన్నా ! నన్ను నీవు కృపచే ప్రేతనయియుండి పడుచున్న యాతనలనుండి ముక్తునిఁగావించితివి. ఈ ప్రేతపీడా వినాశకమగు శ్రీమద్భాగవతకథ ధన్యమయినది. అట్లే శ్రీకృష్ణచంద్రుని పరమధామమును బ్రాపింపఁ జేయు దీని సప్తాహపారాయణమును ధన్యమయినది. సప్తాహశ్రవణ యోగము లభించినంతనె, సమస్తపాపములు ‘ఇఁక నీ భాగవత కథ తతక్షణమే మనల నాశమొనరించు’నని, తరతరలాడి లేచి పోవును. ఏ ప్రకార మగ్ని యెచ్చి పచ్చి కట్టెలను, చిన్న పెద్ద కట్టెలను గాల్చివేయునో యట్టులే సప్తాహశ్రవణము, ప్రాఁత క్రొత్తపాపములను, చిన్న – పెద్ద పాపముల నన్నిటిని భస్మము చేసివైచును, విద్వాంసులు దేవతల సభలో ‘నీ భారతవర్షమున నే పురుషుఁడు శ్రీమద్భాగవతకథను వినఁడో, వాని జీవనము వ్యర్థమయిన’దని పలికిరి. బళీ ! మోహవశమున, లాలన పాలనము లొనరించి యనిత్యమగు నీ శరీరమును కండలు పెంచి బలిపించి, శ్రీమద్భాగవత కథ విననిచో, దీనివలన నేమి లాభము? ఈ శరీరమను కొంపకు ఎముకలాధార స్తంభములు. నరములు నాడు లనెడి రజ్జువులచే బంధించి, రక్తమాంసములచేఁ బూఁతపూసి, చర్మముతోఁ గప్పియుండఁబడినది. దీని ప్రతి యంగమునుండి మలము వెలువడుచుండును. ఏలనన నిది మలమూత్ర భాండము. ముసలి తనమునకు శోకమునకుఁ గారణమగుట నిది పరిణామమున దుఃఖమయమే. రోగములకిది నిత్యనివాసము. ఇది నిరంతర మేదియో యొక కోరికచేఁ బీడింపఁ బడుచునే యుండును. ఎప్పుడును దీనికిఁ దృప్తిలేదు. దీని మోసికొని తిరుగుటయు నొక భారమే. దీని రోమరోమమున దోషము నిండియుండును. ఇది నశించిపోవుట కొకక్షణము పట్టదు; తుదకు దీనిని పూడ్చిపెట్టిన, పురుఁగులగును. ఏవయిన మృగములుదినినఁ బెంటయగును. నిప్పులోఁ గాల్చిన బూడిద యగును. దీని గతి యీ మూఁడు విధములని సిద్ధాంతమైనది. ఇట్టి యస్థిరమగు శరీరముతో, మనుష్యుఁ డవినాశియగు ఫలము నొసఁగు కార్యమేల చేయఁబూనఁడు? ప్రొద్దుటిజామున వండిన యన్నము, మాపటివేళకుఁ బాసిపోవును. అట్టి యన్న రసముతోఁ బోషింపఁబడిన యీ దేహముయొక్క శాశ్వత మేమి?

ఈ లోకమున సప్తాహశ్రవణము చేయుటచే భగవత్ప్రాప్తి శీఘ్రమేకలుగఁ గలదు. ఆ కారణమున సమస్త విధదోషముల నివర్తింపఁజేయ నిదియొకటియే సాధనము. ఎవఁడు భగవత్క థ వినఁడో వాఁడు జలమందలి బుద్బుదమువలెను, జీవులలో దోమవలెను మరణించుటకే జన్మించినవాఁడు. దేని ప్రభావమున జడమయి, యెండిన వెదురు కణువులు (ముడులు) పగిలి పోఁజాలెనో, యట్టి భాగవతకథ శ్రవణము చేయుటచేఁ జిత్త మందలి ముడులు విడిపోవుట యేమంత గొప్పవిషయము? సప్తాహశ్రవణముచే మనుష్యుని హృదయ గ్రంధులు విడిపోవును. అనఁగా వానికిఁగల దేహాత్మబుద్ధి సదా దూరమయి పోవఁ గలదు. వాని సర్వ సంశయములు ఛిన్నాభిన్నములగును. సమస్త కర్మములు క్షీణించిపోవును. భగవత్క థారూపమయిన తీర్థము సంసారజంబాలము (బురద)ను గడిగివేయుటలో మిగుల సమర్థమయినది. హృదయమున నిది యెప్పుడు నిలుచునో మనుష్యునకు ముక్తి నిశ్చయమే యని తెలియవలెనని విద్వాంసుల నానుడి. అని

దుంధుకారి యీ విషయమంతయుఁ జెప్పుచుండెను. ఇంతలో వానికొఱకు, శ్రీవైకుంఠవాసులగు పార్షదులతో నొక విమానముదిగెను. దానిచే నలుగడల మండలాకారముగఁ బ్రకాశమువ్యాపించెను. అక్కడ నెల్లవారి సమీపముననే దుంధుకారి యావిమానము నధిరోహించెను. అప్పుడా విమానము మీఁద వచ్చిన పార్షదులఁగాంచి, గోకర్ణుఁ డిట్లని యడిగెను.

**గోకర్ణుండు :–** భగవత్ప్రియులరగు పార్షదులారా ! ఇక్కడ మాశ్రోత లనేకులుండిరికదా – వీరికందఱికీ విమానముతోనే పెక్కు విమానముల నేలకొనిరాలేదు? ఇక్క డనున్న వారందఱు సమానముగానే కథ వినుట మేము చూచుచున్నాము. ఫలమునందీ భేద మేల కలిగినది.

**భగవత్సేవకు లిట్లనిరి :–** ఓమానదా ! ఈ ఫలభేదమునకుఁ గారణము, వీరి శ్రవణమందలి భేదమే – శ్రవణమో, వీరందఱు సమానముగాఁ జేసియుండుట నిజమే – కాని వీరట్లు మననము చేయలేదు – దీనిచే, నొకసారియే శ్రవణముసేసినప్పటికిని, దానిఫలమునందు భేదము కలిగినది. ఈ ప్రేత యేడు దినముల వఱకు నిరాహారియై శ్రవణము చేయుచుండెను; విన్న దానిని స్థిర చిత్తముతో లెస్సగా మనన నిది ధ్యా

వ్యసనములుకూడఁ జేయుచుండెను – చూడు ! దృఢముగా నిజ్ఞానము. వ్యర్థమై పోవును – ఈ ప్రకారము ధ్యానముంచక పోవుటచే శ్రవణమునకు, సందేహముచే మంత్రమునకు, చిత్త మటునిటు చలించుటచే జపమునకు నేమియు ఫలముండఁబోదు. విష్ణు భక్తులు లేని దేశము నాశమగును; కుపాత్రుఁడగు బ్రాహ్మణునిచేఁ జేయించిన శ్రాద్ధము వ్యర్థమయిపోవును; శ్రోత్రియుండుకాని బ్రాహ్మణున కిచ్చిన దానముల కెట్టి ఫలమును కలుగదు. అనాచారముచే కులము నాశమగును – గురుని వచన ములందు విశ్వాసముంచి, తనయందు దీనుఁడ ననెడి భావన కలిగి, మనోదోషములయెడఁ గనుగలిగి, కథయందు దృఢనిష్ఠ వహించియీకథ వినినఁ బూర్ణఫలము లభింపఁగలదు. మరల శ్రవణము చేయింపుము. అదిముగిసినంతనె యెల్లవారికి శ్రీవైకుంఠవాసము లభింపఁగలదు. భగవానుఁడు స్వయముగా వేంచేసి నిన్ను గోలోకధామమునకుఁ దీసికొని పోవఁగలఁడు. అని యీ ప్రకారము చెప్పి. యాపార్షదులందఱు హరికీర్తనము చేయుచు దుంధుకారిని విమానముమీఁద నుంచుకొని వైకుంఠలోకమునకుఁ బోయిరి.

శ్రావణమాసమున గోకర్ణుఁడు, మరల సప్తాహక్రమము ననుసరించి కథ వినిపించెను. ఆ శ్రోతలందఱు మరల వినిరి నారదా ! ఈ సారి కథ సమాప్తమయిన పిమ్మట నేమి జరిగినదో వినుము. అక్క డ కనేకవిమానము లతో భక్తులతో భగవానుఁడు వేంచేసెను. అప్పు డన్ని ప్రక్క ల జయజయ ధ్వనులు, నమస్కా రనినాదములు నిండిపోయెను. భగవానుఁడు సంతోషించి, పాంచజన్యమును బూరించెను. గోకర్ణుని గాఢాలింగనము చేసికొని సారూప్యము నొసఁగెను. దీనికిఁ బిమ్మట భగవానుఁడు తక్కు గల శ్రోతులనందఱను మేఘము వలె శ్యామవర్ణము గలవారిగాను, పీతాంబరధారులుగాను, కిరీటకుండలాది భూషితులుగను గావించెను. ఆ గ్రామమందలి కుక్క లు, చండాలులు మున్నుగాఁగల జీవులనన్నిటిని గోకర్ణుని కృపచే విమానములమీఁద నధిరోహింపఁ జేసి శ్రీ వైకుంఠధామమునకుఁ బంపెను. ఈ ప్రకారము భక్తవత్సలుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు, వారి కథాశ్రవణముచేఁ బ్రసన్నుఁడయి గోకర్ణుని తనతోఁ దీసికొని, గోపబాలకులకుఁ బ్రియమైన గోలోకధామమునకు వేంచేసెను. పూర్వకాలమున నయోధ్యావాసులు శ్రీరామప్రభునితో సాకేతధామమునకుఁ జనిన విధముగా, శ్రీకృష్ణభగవానుఁడు వీరినెల్ల గొప్పగొప్ప యోగులకును దుర్లభమైన గోలోకధామమునకుఁ గొనిపోయెను. సూర్యచంద్రులకును సిద్ధులకును దుర్గమమయిన లోకమునకు శ్రీమద్భాగవత శ్రవణము చేతనే వారు పోవఁగలిగిరి.

నారదా ! సప్తాహయజ్ఞమునఁ గథా శ్రవణము చేయుటచే నెట్టి యుజ్జ్వలఫలము గలుగునో దానినిగుఱించి మేమేమి నీకుఁ జెప్పుదుము? ఓహో ! ఎవరు తమ కర్ణపుటముల, గోకర్ణుని కథలోని యొక యక్షరమును బానము చేయుదురో వారు మరల మాతృగర్భమునకురారు. వాతాంబు పర్ణాశనులయి, శరీరమును శుష్కిం పఁజేసి, బహుకాలము వఱకుఁ జేయు ఘోరతపస్సు చేతను, యోగాభ్యాసము చేతను బొందజేయు గతి, సప్తాహశ్రవణముచేత సహజముగానే లభింపఁగలదు. పరమపవిత్రమగు నీ యితిహాసమును జిత్రకూటపర్వతము మీఁద విరాజమానుఁడైన శాండిల్యమహాముని బ్రహ్మానందమున మగ్నుఁడయి పఠింపజేయుచుండును. ఈ కథ మహాపవిత్రమైనది. శ్రాద్ధకాలమున దీనిని బఠించినచోఁ బితృదేవతల కతిశయమగు తృప్తికలుగును. నిత్యము పఠించినవాఁడు జన్మ మరణచక్రమునఁ దగుల్కొ నఁడు.

# ఆఱవ యధ్యాయము

## సప్తాహపారాయణవిధి

**శ్రీసనకాదు లిట్లనిరి :–** నారదమునీంద్రా ! యిప్పుడు మేము నీకు సప్తాహశ్రవణవిధి వివరించెదము వినుము. ఈవిధానము లోకుల సహాయముచేతను, ధనముచేతను సాధ్యమయినదని తెలియఁబడుచున్నది. మునుముందు దైవజ్ఞులను బిలిచి, ముహూర్తము నడుగవలెను. ఒక వివాహమున కెంతధనము సేకరింతుమో యంతధనము సమకూర్చవలెను. కథారంభమునకు, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశిరము, ఆషాఢము, శ్రావణము – ఈ యాఱునెలలు శ్రోతలకు మోక్షకారణములుగా గణింపఁబడుచున్నవి. ఈ మాసములలో భద్ర వ్యతీపాతాది త్యాజ్యకాలములు సర్వప్రకారముల సోఁక కుండఁ జూడవలెను. మఱియుఁ బ్రయత్నపూర్వకము దేశదేశాంతరములకు మనుష్యులనుబంపి 'యీ ప్రదేశమున శ్రీమద్భాగవత సప్తాహము జరగును, గావున బంధువులతో మిత్రులతోఁ బరివారముతో విచ్చేసి భగవత్క థాశ్రవణము చేసి కృతార్థులఁ జేయవలసిన'దని యెల్లరకును దెలుప నేర్పాటు చేయవలయును. భగవంతునికథ యననేమియో, హరికీర్తనమన నేమియో యెఱుఁగని వారెందఱో కలరు. అందఱు నీఘోరమగు సంసారమను పెద్దసముద్రమును దాఁటి కృతార్థులగుట ముఖ్యము గదా. కాఁబట్టి శూద్రులకు స్త్రీలకు మున్నగువారి కందఱకును నీ విషయమును దెలియు నట్టులు తగిన యేర్పాటులు గావింపవలెను. ఇతర దేశములందుండు విరక్తులగు వైష్ణవుల సన్నిధికి, భగవద్గుణ నామకీర్తనమందను రాగముగల పరమ భాగవతులకు వారి సన్నిధాన మత్యంతావసరము. కావున వ్యయ ప్రయాసములకు వెనుకాడక యాహ్వానపత్రములు శ్రద్ధాభక్తి పురస్సరముగాఁ బంపవలెను. నిమంత్రణ పత్రిక వ్రాయుపద్ధతి 'మహానుభావులారా ! యీ ప్రదేశమున నీ దినము మొదలుకొని యేడుదినముల వఱకు నపూర్వ రసమయమును బరమ పవిత్రమును బరమ కళ్యాణ ప్రదమును నగు శ్రీమద్భాగవత కథ జరుగును. పరమయోగి వరేణ్యులగు శ్రీశుకుల ముఖ సుధా ద్రవమునఁ గలిసి యత్యంతమాధుర్యమునకు నియమగు శ్రీమద్భాగవతకథామృతరసము నెఱిఁగి యానందింపఁగల రసిక భావవిదులరగు తా మమూల్యమును దుర్లభమునునగు నీ సమయమునఁ బ్రేమపూర్వకముగ విచ్చేయఁ గటాక్షింప వలెను. కథ పూర్తియగునంతవఱకు నుండుటకుఁ దమకే కారణమున నయిన నవకాశము కలుగదేని తుదకొకదినమయినను దమ పవిత్రపాదధూలిచే నీ ప్రదేశమును బావనము చేసెదరుగాత మని యాశించుచున్నాము. ఇట్టి సమయమన్నప్పుడంతయు లభించుట దుర్ఘటము గావునఁ దమనింతగాఁ బ్రార్థించితిమి' అని పత్రిక లిఖించి సవినయముగ వారికడకుఁ బంపి యామంత్రితులఁ జేయవలెను. వచ్చిన వారికిఁ దగిన వసతులు సర్వవస్తు సంపన్నముగా నేర్పాటు చేయవలెను.

ఈ భాగవత సప్తాహశ్రవణ మేప్రదేశమునఁ జేయవలయు ననఁగా శ్రీగంగా యమునాది పుణ్యతీర్థము లుండు తావునఁ గాని, శ్రీ బృందావనము నైమిశారణ్యము మున్నగు పుణ్యవనములందుఁగాని, లేదా తనయింటి యందేకాని జరగుట యుక్తమని పెద్దలమతము. శ్రీభాగవతకథ జరగు స్థలము విశాలమైనదిగా నుండవలెను. ఆ ప్రదేశమును జక్క ఁగా గోమయముతో నలికి, రంగవల్లులుతీర్చి, తోరణములుకట్టి యలంకరింపవలెను. గృహ మందలి సామగ్రులనెల్ల నాప్రదేశమునందుండి తీసి లోన నెక్క డనో నొకమూల జాగ్రత్త చేసికొనవలెను. అయిదు దినాలకు ముందుగానే కథ వినువారు కూర్చుండుటకుఁ దగిన యాసనము లనేకములు సేకరించి యుంచవలెను. ఎత్తుగా నొకమండపము నేర్పాటు చేయవలెను. అరఁటిచెట్లు పోకమ్రాకులతో దాని నలంకరింప వలెను. పూలు, పండ్లు, పచ్చని యాకు జొంపముల తోరణములు కట్టవలెను. వివిధములగు వితానములు (చాందిని) కట్టవలెను. ఆ మండపమున కుపరిభాగమున సప్తలోకములఁ గల్పించి ముందుగానే యచట నుచితములగు నాసనము లేర్పాటుచేసి విరక్తులగు బ్రహ్మణుల ననునయించి యందాసీనులఁ జేయవలెను. దీనికంటె వేఱుగా వక్తకొక పెద్ద వ్యాసపీఠమును నిర్మింపవలెను. వక్తయుత్తరముఖముగా నున్న వినువారు తూర్పు మొగముగాను, చెప్పునతఁడు తూర్పు మొగమైన వినువారు త్తర ముఖముగాఁ గూర్చుండ వలెను, అథవావక్తకు శ్రోతలకు నడుమ తూర్పుదిశరావలెను. దేశకాలగతు లెఱిఁగిన మహానుభావులు శ్రోతల కీ నియమమును విధించిరి. వేదశాస్త్రములను స్పష్టముగా వ్యాఖ్యానము చేయ సమర్థుఁడును, వివిధములగు దృష్టాంతముల నీయఁ గలవాఁడును, వివేకియు, నత్యంత నిస్పృహుఁడును నగు నీదృగ్వికర్త విష్ణుభక్తుఁడగు బ్రాహ్మణుఁడు వక్తగా నుండఁ దగును. అనేక మత–మతాంతర వ్యామోహమునఁ దగుల్కొ నిన వాఁడును, స్త్రీలంపటుఁడును, నాస్తిక వాదమును సమర్థించువాఁడును, వాఁడెంత పండితుఁడే కానీ యట్టివానిని శ్రీమద్భాగవతమునకు వక్తగా నేర్పాటు చేయరాదు. వక్త దగ్గఱ వారికి సహాయముగా నట్టివాఁడేయొకవిద్వాంసుఁ డుండ వలెను. అతఁడును సర్వసంశయముల నివారించుటకు సమర్థుఁడును, లోకులకుఁ జక్క ఁగ దెలియఁ

జెప్పఁగల కౌశల్యము గలవాఁడుగ నుండవలెను.

వ్రతమును బూర్తిగ నిర్వహించు వక్త, కథారంభమున కొకదినము మందు క్షురకర్మము చేయించుకొన వలెను. శ్రోతలరుణోదయవేళకు అనఁగా సూర్యోదయమునకు రెండు గడియలు ముందుగా శౌచము నివర్తించుకొని శాస్త్రోక్తవిధి ననుసరించి చక్క ఁగా స్నానమొనరించి, సంధ్యాదినిత్యకర్మముల సంక్షేపముగా నెఱవేర్చుకొని కథకెట్టి విఘ్నములు రాకుండుటకు గణేశ్వరుని బూజింపవలెను. తదనంతరము, పితృగుణమునకుఁ దర్పణముగావించి పూర్వపాపముల శుద్ధికై ప్రాయశ్చిత్తము చేసికొని, యొక మండలము గల్పించి, యందు శ్రీహరిని స్థాపింపవలెను. వెండియు శ్రీకృష్ణభగవాను నుద్దేశించి మంత్రోచ్చారణ పూర్వకముగఁ గ్రమముగ షోడశోపచార విధిగఁ బూజసలిపి, యావలఁ బ్రదక్షిణ నమస్కా రములు సమర్పించి. “కరుణానిధానా ! నేను సంసార సముద్రమున మునిఁగియున్నాను. కడుదీనుఁడను. కర్మమోహమనెడి మొసలి నన్నుఁ బట్టుకొనినది. తాము నన్నీ సంసార సాగరమునుండి యుద్ధరింపుఁడు” అని స్తుతింపవలెను. అటుపిమ్మట ధూపదీపాది సామగ్రులతో శ్రీమద్భాగవతకోశమునకును మిగుల నుత్సాహముతోఁ బ్రీతిపూర్వకముగ విధివిధానము ననుసరించి పూజచేయవలెను. ఆవల శ్రీకోశమున కెదురుగ నారికేళము నునిచి, నమస్క రించి, ప్రసన్న చిత్తమున నిట్లని స్తుతి గావింప వలెను. “శ్రీమద్భాగవతరూపమున సాక్షాత్ శ్రీకృష్ణచంద్రుఁ డగు దేవరయే విరాజమానులయి యున్నారు. నాథా ! దాసుఁ డీ భవసాగరమునుండి విడుమర గావించుటకు మిమ్ము శరణు జొచ్చివాఁడు. దాసుని యీమనోరథమును దామెట్టి విఘ్న బాధలు లేకుండ సాంగోపాంగముగాఁ బూర్తిచేయ వలెను. కేశవా ! దేవరవారికి వీఁడు దాసుఁడు.”

ఈ ప్రకారము దీనములగు వచనములాడి, యావల వక్తను బూజింపవలెను. అతని సుందరవస్త్రా భరణములతో భూషితు నొనరించునది. మఱిపూజయయిన పిమ్మట నిట్లనిస్తుతింపవలెను. శుకస్వరూపులరగు దేవరవారు జ్ఞానదానమునఁ బ్రవీణులరు. సర్వశాస్త్రపారంగతులరు. కృపతో నీకథను బ్రకాశిత మొనరించి నా యజ్ఞానము బోఁగొట్టుఁడు. ఆవల స్వకల్యాణార్థ మాతని సన్నిధి నియమగ్రహణ మొనర్చి, సప్తాహమగువఱకు యథాశక్తి నియమపాలనము గావింపవలెను. కథలో నడుమ విఘ్నము కలుగకుండుట ముఖ్యముగాన, నయిదుగురు బ్రాహ్మణులచే ద్వాదశాక్షరమంత్రమును జపము చేయించవలెను. పిమ్మట బ్రాహ్మణులను, విష్ణు భక్తులను, కీర్తిన చేయువారలను నమస్క రించి పూజించి వారి యనుజ్ఞవడసి తానును నాసనమునఁ గూర్చుండ వలెను. ఏ పురుషుఁడు లోకచింత, సంపత్తి, ధనము గృహపుత్రాదిక చింత విడిచి, శుద్ధాంతఃకణముతో కేవల కథయందే ధ్యానముంచునో వాకి కీ శ్రవణమున నుత్త మోత్తమ ఫలము లభించును.

బుద్ధిమంతుఁడగు వక్త సూర్యోదయమునుండి కథ నారంభముచేసి, మూఁడున్నరజాములవఱకు మధ్యమ స్వరముతో లెస్సగాఁ గథను జెప్పవలెను. రెండుజాములప్పుడు రెండు ఘడియలు కథను నిలుపవలెను. ఆ సమయమున కథాప్రసంగానుసారము భాగవతులయు, భగవంతునియు గుణకీర్తనము గావింపవలెను. వ్యర్థ ప్రసంగము చేయరాదు. కథాసమయమున మలమూత్ర వేగమును నాపుటకు స్వల్పాహారమును తీసికొనవలెను. శక్తికలదేని యేడుదినములు నిరాహారిగా నుండి కథవినునది. లేదా కేవలము నేయి లేక పాలు త్రాగి సుఖ పూర్వకముగ శ్రవణము చేయ వచ్చును. కాదా పండ్లుతిని లేక యొకపూఁట సాపాటుచేయునది. ఏనియమము లెట్లు చేయుమన్నను, వానిని కథాశ్రవణము కొఱకేని గ్రహింప వలెనని తాత్పర్యము, కథాశ్రవణమునకు సహాయకమగు నేని యుపవాసము కంటె భోజనముచేయుటే మంచిదని నేను దలఁచుచున్నాను. ఉపవాసమువలన శ్రవణమున బాధకలుగు నేని యా యుపవాసము వలన నేమి ప్రయోజనము ?

నారదా ! నియమముగా సప్తాహశ్రవణము చేయువారే నియమములఁ బాలింపవలెనో వినుము. విష్ణు మంత్రదీక్ష గ్రహింపనివాఁడు, హృదయమున భగవంతునియెడ భక్తి లేని వాఁడు, యీ కథ వినుట కధికారి కాఁడు. నియమముతోఁ గథవినువాఁడు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠింపవలెను. నేలమీఁదఁ బరుండవలెను. నిత్య ప్రతి కథ ముగిసినపిమ్మట పత్రభోజనము (ఉత్తరదేశీయులు పాత్రభోజకులు) చేయవలెను. పప్పు, తేనె, నూనె, బలువైన యన్నము, భావదూషిత పదార్థములు, పాసిన యన్నము సర్వదా త్యజింపవలెను. కామము, క్రోధము, మదము, మానము, మత్సరము, లోభము, దంభము, మోహము, ద్వేషము, తన కడకుఁ జేరనీయనే రాదు. వేదములను, వైష్ణవులను, బ్రాహ్మణులను, గురువులను, గోసేవకులను, స్త్రీలను, రాజును, మహాపురుషులను నిందచేయఁగూడదు. నియమపూర్వకముగఁ గథ వినువారు. రజస్వలమైన స్త్రీతో, అంత్యజుల (చండాలాదులు) తో, మ్లేచ్ఛుల (గోభక్షకుల) తో, పతితులతో, గాయత్రీహీనులగు ద్విజులతో, బ్రాహ్మణుల ద్వేషించువారితో, వేదముల నాదరింపని వారితో మాటలాడరాదు. సర్వదా సత్యము, శౌచము, దయ, మౌనము, సరళత, వినయము, ఉదారత కలిగియుండ వలెను. ధనహీనులు, క్షయరోగులు, మఱియే యితర రోగము

లచేనైన బీడింపబడువారలు, అదృష్టహీనులు, పాపులు, పుత్రహీనులు, ముముక్షువు లీ కథ వినుటకు విశేషాధికారులు, రజోదర్శనము నిలిచిపోయిన స్త్రీలు, ఒకటియే సంతానము కలిగినవారు, గర్భస్రావము కలిగినవారు, వంధ్యలు, (గొడ్రాలు) సంతానము కలిగిపోవువారు, గర్భస్రావముగలవా రవశ్య మీ కథ వినవలెను. ఇట్టి వారందఱు విధిపూర్వకముగఁ గథ వినినచో నక్షయఫలప్రాప్తికలవారు కాఁగలరు. అనుత్తమమగు నీ కథ కోట్లయజ్ఞముల ఫలమునిచ్చు ప్రభావముకలది.

ఈ ప్రకార మీ వ్రతవిధులు ననుష్ఠించి, మఱి యుద్యాపనము చేయవలెను. దీనివలన విశేషఫలము నొందవలె ననెడి యిచ్ఛగలవారు జన్మాష్ట మీ వ్రతమునకు సమానముగానే యీ కథావ్రతమునకు నుద్యాపనము చేయునది. కాని భగవానున కకించిన భక్తులగు వారి కుద్యాపన చేయవలె ననెడి బదనాయము లేదు. వారు శ్రవణముతోనే పవిత్రులయ్యెదరు. ఏలనన వారు విష్ణుపరాయణులు; వారెట్టి ఫలము నాశింపరు.

ఈ ప్రకారము సప్తాహము సమాప్తము కాఁగానే, శ్రోతలత్యంత భక్తి పూర్వకముగా, శ్రీకోశమునకు, వక్తకుఁ బూజచేయవలెను. అనంతరము వక్త, శ్రోతలకుఁ బ్రసాదము, తులసి ప్రసాదరూపమగు మాలల నీయ వలెను. పిమ్మట నెల్లవారును, మృదంగ, తాలములు పూని మనోహర ధ్వనితో చక్క ఁగ హరికీర్తనము గావింపవలెను. మఱియు జయ జయ ధ్వనులు, నమస్కా ర ధ్వనులు శంఖారావములు గావింపఁజేసి, బ్రాహ్మణులకు యాచకులకు ధనము, నన్నము నిడవలెను. ఇదియయిన మఱుసటి దినము, శ్రోత విరక్తుఁ డయ్యేనేని, కర్మమునకు శాంతికై గీతాపారాయణము చేయునది. గృహస్థుఁ డయ్యేనేని హవనము చేయవలెను. ఆహెూమ క్రియయందు దశమస్క ంధములోని యొక్కొ క్క శ్లోకమును బఠించి విధిపూర్వకముగ క్షీర మధు ఘృత తిలాది సామాగ్రులతో నాహుతిచేయవలెను. అథవా, ఏకాగ్రచిత్తముతో గాయత్రీమంత్రముతో హవనము చేయించవలెను. ఏలనన వాస్తవముగ నీ మహాపురాణము గాయత్రీ స్వరూపమే. హెూమము చేయించుటకు శక్తిచాలనిచో, తత్ఫలప్రాప్తికై బ్రాహ్మణులకు హవనద్రవ్యములను గొంత యీయవలెను. వెండియు, ననేక విఘ్నములు నివర్తించుటకును, విధియందు న్యూనాధికతలుండునేని యా దోషములు శాంతించుటకును, విష్ణుసహస్రనామపారాయణము చేయవలెను. దానితో సమస్త కర్మములు సఫలములగును. ఏలననఁగా నేదియు నింతకు మించినది లేదు.

దీనికిఁ బిమ్మటఁ బన్నిద్దఱు బ్రాహ్మణులకు క్షీరము, మధువు మున్నగు మంచి మంచి పదార్థములతో భోజనము పెట్టవలెను. వ్రతపూర్తికయి గో, సువర్ణ దానములు చేయవలెను. సమర్థత యుండినచో, మూఁడు తులముల బంగారుతో నొక సింహాసనము చేయించి, దానిమీఁద చక్క ని యక్షరములలో వ్రాసిన శ్రీమద్భాగవత కోశము నునిచి, దాని కావాహనాది వివిధోపచారములు సమర్పించి, జితేంద్రియుఁడగు నాచార్యుని వస్త్ర భూషణ గంధాదులతోఁ బూజ సలిపి, సదక్షిణముగ శ్రీకోశమును సమర్పింపవలెను. ఇట్టు లొనరించిన బుద్ధిమంతుఁ డగు దాత, జన్మ మరణ బంధమునుండి ముక్తుఁడగును. సప్తాహపారాయణము సర్వపాపముల నివర్తింపఁ జేయును. దీని నీ ప్రకారము చక్క గా నాచరించిన, మంగళమయమగు నీ భాగవత పురాణమభీష్ట ఫలముల నొసఁగును. ధర్మ, అర్థ, కామ, మోక్షము లనెడి చతుర్విధపురుషార్థసిద్ధి కిది సాధనమగును ఇందు సందియ మిసుమంతయు లేదు. అని మఱియు

**సనకాదు లిట్లనిరి :–** నారదా ! యీ ప్రకారము నీ కీ సప్తహశ్రవణవిధిని సమగ్రముగ వినిచితిమి. ఇఁక మఱేమి వినఁగోరెదవు? ఈ శ్రీమద్భాగవతమో భుక్తిముక్తులు రెంటిని హస్తగత మొనరించును.

**సూతుఁడిట్లనియె :–** శౌనకమునిపుంగవా ! శౌనకమునిపుంగవా ! యీ ప్రకారమానతిచ్చి, సనకాదు లొక యేడుదినముల వఱకు, విధిపూర్వకముగఁ సర్వపాప ప్రణాశినియు, పరమపవిత్రయు, భుక్తిముక్తి ప్రదాత్రియు నగు నీ భాగవతకథను వినిపించిరి. సమస్తప్రాణులు నియమపూర్వకముగ దీనిని శ్రవణము చేసిరి. దీని యనంతరము వారు విధిపురస్సరముగ భగవానుఁడగు పురుషోత్తముని స్తుతిగావించిరి. దీనిచే జ్ఞాన వైరాగ్య భక్తులకు మిగులఁ బుష్టి కలిగి తతక్షణము తరుణత్వమునుబడసి యెల్లర చిత్తముల నాకర్షింపఁ దొడఁగెను. తన మనోరథము సిద్ధించుటచే నారద మహర్షియు మిగులఁ బ్రపన్నుఁ డయ్యెను. ఆయనకు శరీరమంతయు రోమాంచ కంచుకిత మయ్యెను. దేవర్షి పరమానంద పూర్ణుఁడయ్యెను. ఈ ప్రకారము కథా శ్రవణ మొనరించి, భగవత్ప్రియుఁడగు నారదుఁడు చేతులు జోడించి ప్రేమగద్గద వాణితో సనకాదుల కిట్లని విన్నవించెను.

"నేను బరమధన్యుడను; దాము కరుణించి నన్ను మిగుల ననుగ్రహించితిరి. నేఁడో, నాకు సమస్త పాపనివారకుఁ డగు శ్రీహరి ప్రాప్తి కలిగెను. తపోధనులరగు మునీశ్వరగణములారా ! సమస్త ధర్మములలో శ్రీమద్భాగవతశ్రవణమే శ్రేష్ఠమయినదని నా యభిప్రాయము. ఏలనందురా ! దీనిచేతనే సాక్షాత్ వైకుంఠవిహారియగు శ్రీకృష్ణపరమాత్మను జేర వచ్చును".

**సూతుఁ డిట్లనియె :–** శౌనకమునీంద్రా ! వైష్ణవ శ్రేష్ఠుఁ డగు శ్రీనారదుఁ డిట్లనుచుండఁగనే, యందందు గ్రుమ్మరుచు యోగీశ్వరుఁడగు శ్రీశుకు లక్క డకు వేంచేసిరి. వ్యాసనందనుఁ డగు శ్రీ శుకభగవానుని వయస్సు పదునాఱేఁడులుగ దోఁచుచుండును. వా రాత్మలాభముతోడనే దనివి చెందెదరు. వారెట్టి లౌకికాలౌకిక పదార్థముల వాంఛించువారు కారు. ఆయన జ్ఞానమనెడి మహార్ణవమునకు సాక్షాత్ పూర్ణచంద్రుఁడే. వారు సరిగా కథాసమాప్తి సమయమున కక్క డకు విచ్చేసిరి. ఆ సమయమునను వారు మెల్లమెల్లగ శ్రీమద్భాగవతపాఠము చేయుచుండిరి. పరమతేజస్వియగు శ్రీ శుకదేవునిఁ జూడఁగనే, సభలోనున్నవారంద ఱొకపెట్టున లేచి నిలఁబడి, వారి నొక యున్నతాసనమున వేంచేయఁజేసిరి. తరువాత నారదమహర్షి వారికిఁ బ్రేమపూర్వకముగఁ బూజగావించిరి. ఈ ప్రకారము వారు శాంతముగ వేంచేసి 'స్పష్టమగు నా మాటను వినుఁ' డనుచు **శ్రీశుకదేవుఁ డిట్లనియె :–**

"రస మర్మజ్ఞులు, భక్తి భావభరితాంతఃకరణుల రగునో భక్తజనులారా ! యీ శ్రీమద్భాగవతము వేదకల్ప వృక్షమునఁ బండిన పండు. శ్రీ శుకదేవుఁ డనెడి చిలుక ముక్కు సంబంధమున బరమానందమ యసుధారమునఁ బరిపూర్ణమైనది. ఇది యంతయు మధురాతిమధురమైన రసమే. ఈ ఫలమునందు, తొక్క, టెంక, మున్నగు వదలవలసినవి కొంచెమైనను లేవు. శరీరమున నెంతవఱకుఁ జేతనత్వముండునో, యెంతదనుకఁ బ్రపంచము లయము గాకుండునో, యంత దాఁక దివ్యమగు నీ భగవద్రసమును సారెసారెకు నిరంతరము పానము చేయుఁడు. దీనికొఱకు స్వర్గమునకుఁ బోవలసిన పని లేదు. ఇదియో యీ భూమి మీఁదనే సులభముగ లభించును. ఈ శ్రీమద్భాగవత మహాపురాణము, నా జనకుఁడు, మహామునియు నైన శ్రీకృష్ణద్వైపాయన వ్యాసభగవానుఁడు రచించెను. దీనియం దా నిష్క పట పరమధర్మము నిరూపింపఁ బడినది. ఇందు మోక్షపర్యంత మెట్టి వస్తువునందును కామనా గంధము లేశమయినను లేదు. ఆ పరమధర్మ మనన్యము. మోక్షము వఱకుఁ గల యెట్టి వస్తువునందును గామనాగంధము లేశమైనను లేదో యాపరధర్మ మనన్యము విశుద్ధము నగు భగ్రత్ప్రేమ. ఎవని హృదయము విశుద్ధము, మత్సరహీనము నయియుండునో యట్టి సత్పురుషుల కెఱుఁగ యోగ్యమయిన యావస్తువు (భగవానుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మము) నిరూపింపఁ బడినది. ఇది యాధ్యాత్మికాది దైవికాధిభౌతికము లనెడి తాపత్రయమును నిర్మూలించునదియు బరమ కల్యాణదాయియునైయున్నది. దీని నాశ్రయించువారికి విలంబముగ ఫలమిచ్చు నితర సాధనలు వేనితోడను, శాస్త్రములతోడను నావశ్యము లేదు. ఏ సత్పురుషుఁడో తన యనేక జన్మముల సుకృతముల పరిపాకమయిననే యీమహాపురాణము నిచ్చ చేయును. ఆ సజ్జనుని హృదయము భగవానుఁడే స్వయముగా నా క్షణముననే ప్రవేశించి విరాజమానుఁడగును. మరల నందుండి తొలఁగి పోవఁడు. ఈ శ్రీమద్భాగవతము పురాణములకుఁ దిలకము. వైష్ణవుల ధనము. ఇందుఁ బరమహంసలకు వలయు విశుద్ధ జ్ఞానమే వర్ణింపఁబడినది. జ్ఞాన భక్తివైరాగ్య భక్తి సహిత నివృత్తి మార్గమే యిందు ప్రకాశితమయినది. ఏ పురుషుఁడు దీనిని భక్తి పూర్వకముగ శ్రవణ, పాఠ, మననములు చేయునో, వాఁడు ముక్తుఁడగును. ఈ రసము స్వర్గలోకములో లేదు. సత్యలోకములో లేదు. కైలాసమున లేదు. వైకుంఠమునను లేదు. కావున భాగ్యశాలురగు శ్రోతలారా ! మీరు దీని నాపోవఁ గ్రోలుఁడు. దీని నే ప్రకారముగను విడువవలదు. విడువవలదు.

**సూతుఁడిట్లనియె :–** శ్రీశుకదేవుఁ డీవిధముగఁ జెప్పుచునే యుండెను. ఇంతలో సభామధ్యమున ప్రహ్లాద, బలి, యుద్ధవార్జునాదిపార్ష దులతో సాక్షాత్ శ్రీహరి సాక్షాత్క రించెను. అప్పుడు దేవర్షి నారదుఁడు భగవానుని తద్భక్తులను యథావిధిగాఁ బూజసల్పెను. భగవంతుఁడు ప్రసన్నుఁడగుట చూచి, దేవర్షి, వారి విశాల దివ్య సింహాసనమున నాసీనుఁ గావించి. యా ప్రభుని సమక్షమున సంకీర్తనము చేయఁ జాగెను. ఆ కీర్తన చూచుటకుఁ బార్వతీసహితుఁడయి మహాదేవుఁడును, బ్రహ్మయును విచ్చేసిరి. అంతఁ గీర్తన మారంభమయ్యెను. ప్రహ్లాదుఁడు, చంచలగతియయిన కారణమునఁ గరతాళము వేయుచుండెను. ఉద్ధవుఁడు మంజీరమెత్తుకొనెను. నారదముని వీణ వాయించుచుండెను. గానవిద్యాకుశులుఁడయిన నర్జునుఁడు రాగాలాపనము చేసెను. ఇంద్రుఁడు మృదంగము వాయింప నారంభించెను. సనకాదులు నడుమనడుమ జయజయధ్వనులు చేయుచుండిరి. వీరందఱకు ముందు నిలిచి శుకుఁడు వివిధాభినయముల సరస భావప్రకటనము చేయుచుండెను. వీరందఱకు నడుమ జ్ఞాన వైరాగ్యభక్తులు నటుల వలె నాట్యము చేయఁ సాగిరి. ఇట్టి యలౌకిక కీర్తననుచూచి భగవానుఁడు ప్రసన్నుఁ డయి 'మీ కథాకీర్తనములు నాకత్యంత సంతోషదాయకములయ్యెను. మీ భక్తి భావమే నన్ను మీవశము గావించెను. కావున నన్ను మీరు వరమునడుగుఁడు. అని యాడిన భగవంతుని వచనములను విని యెల్లరు మిగుల నానందమగ్నులయి ప్రేమార్ద్రచిత్తములతో భగవానునితో నిట్లని విన్నవించిరి. 'భవిష్యత్ కాలమునందును యెక్క డ సప్తాహకథజరగునో, యక్క డక్క డ దేవర యీ భక్తులతో సన్నిధి కటాక్షింప వలెనని మాయభిలాష. మా యీయాశ పూర్తిచేయవలెను'

అని ప్రార్థింప, భగవానుఁడు 'తథాస్తు' అని యంతర్ధానుఁ డయ్యెను.

తదనంతరము నారదమహర్షి భగవానుని భగవత్పార్షదుల నుద్దేశించి ప్రణామ మర్పించి, యావల శ్రీశుక బ్రహ్మము మున్నగు తపస్వులకును నమస్క రించెను. కథామృతమును బానము చేయుటచే నెల్లరకు నమితానందము కలిగెను. వారి మోహమంతయు నాశమయ్యెను. తరువాత నందఱును వారి వారి స్థానములకుఁ దరలి పోయిరి. ఆ సమయమున శ్రీ శుకదేవుఁడు భక్తిని యామెపుత్రులతోఁ దన శాస్త్రమున స్థాపించెను. శ్రీ భాగవతమును సేవించుటచేత శ్రీహరి వైష్ణవుల హృదయములందు విచ్చేసి సన్నిధి కటాక్షించును. దరిద్రము చేతను, దుఃఖజ్వరము చేతను బీడితులగుజనులును, మాయా పిశాచికి వశమయిన వారును, సంసార సముద్రమున మునిఁగిన వారును నగు వారికల్యాణమునకే శ్రీమద్భాగవతము గర్జనము చేయుచుండును.

**అంత శౌనకమహాముని యిట్లనియె :** సూతా ! మాకొక సందేహముకలదు. దానిని పోఁగొట్టువలెను. శ్రీశుకమహర్షి పరీక్షిత్తునకును, గోకర్ణుఁడు దుంధుకారికిని, సనకాదులు శ్రీనారదమునికిని నేయేసమయమున నీగ్రంథమును వినిపించిరి.

**సూతుఁడిట్లనియె :–** శ్రీకృష్ణ భగవానుఁడు స్వధామమునకు వేంచేసి తరువాతఁ గలియుగమున ముప్పది సంవత్సరముల కించుక యధికముగాఁ గడచిన పిమ్మట వచ్చిన భాద్రపద మాసమున శుక్లపక్ష నవమితిథినాఁడు శ్రీశుకమహర్షి శ్రీమద్భాగవతకథ నారంభముచేసెను. శ్రీపరీక్షిన్మహారాజు కథ వినిన తర్వాత రెండువందల సంవత్సరములు కడచిన పిమ్మట ఆషాఢమాసమున శుక్లనవమికి గోకర్ణుఁ డీకథను వినిపించెను. ఇది జరిగిన యనంతరము కలియుగమున మూఁడు నూఱులేఁడులు గడచిన పిమ్మట కార్తిక శుక్లనవమినుండి సనకాదు లీకథ నారంభముచేసిరి. అనఘా ! శౌనకముని పుంగవా ! నీవడిగిన దానికెల్ల నేనుత్తర మొసఁగితిని. ఈ కలి యుగమున సంసారరోగము నున్మూలించెడి పరమౌషధ మీ భాగవతకథ.

సాధుజనులారా ! తా మాదరపూర్వకముగ నీ కథామృతమును బానముచేయుఁడు. ఇది శ్రీకృష్ణున కత్యంత ప్రియమయినది. సమస్తపాపముల నాశముచేయునది. ముక్తికిఁ బ్రధానకారణమైనది, భక్తివర్ధకమైనది. లోకమునఁ గల్యాణ కరములగు నితరసాధనల విచారించుటచేతను, తీర్థముల సేవించుటచేతను నేమికాఁగలదు? చేతులందుఁ బాశములు ధరించియున్న తనకింకరులనుజూచి యమధర్మరాజు 'చూడుఁడు ! భగవానుని కథా వార్తలందు మత్తులయిన వారికి దూరముగా నుండుఁడు. నే నితరులదండింపఁ గలవాఁడనే కాని వైష్ణవులను దండింపఁగాదు'. అని వారి చెవిలో రహస్యముగాఁ జెప్పెను. అపారమగు నీ సంసారమున విషయవిషమున వ్యాకులతఁ జెందినవారలారా ! అరక్షణమయిన నీ భాగవతకథానుపమసుధారసమును బానము చేయుదు రేని శాంతిలభింపఁగలదు. మీ రితరకుత్సితకథలతోఁ గూడిన కూమార్గములం దేల వ్యర్థముగాఁ ద్రిమ్మరెదరు? ఈకథ చెవినిబడినంతనె ముక్తి చేకూరును. దీనికిఁ బరీక్షిత్తే ప్రత్యక్ష ప్రమాణము. శ్రీశుకదేవుఁడు ప్రేమరస ప్రవాహమున నీదులాడుచు నీకథను జెప్పెను. ఇది యెవనికంఠముతో సంబంధము కలదగునో వాఁడు శ్రీవైకుంఠమునకు స్వామియగును. శౌనకమునీశ్వరా ! సర్వశాస్త్రములను బరిశోధించి యీపరమగుహ్య రహస్యమును మీకు వినిపించితిని సమస్త శాస్త్రసిద్ధాంతములలోని సారమిది. ప్రపంచమున నీ శ్రీశుకశాస్త్రమునకు మించి యధిక పవిత్రమయిన దింకొక వస్తువులేదు. కావున తాము పరమానందప్రాప్తి కొఱకీద్వా దశస్క ంధ రూపరసమును బానము చేయుఁడు. ఏపురుషుఁడు నియమపూర్వకముగ దీనిని భక్తి భావముతో వినునో, విశుద్ధులగు వైష్ణవుల సన్నిధిలో వినిపించునో, యీ యిరువురే విధిని పూర్తిగాఁ బాలించిన కారణమున యథార్థ ఫలమును బడయఁ గలరు. వారి కీమూఁడులోకములలో నసాధ్యమేదియు నుండఁ బోదు.

(ఇంత వఱకు జరిగిన కథ పద్మపురాణాంతర్గతము. స్కా ందపురాణము నందును శ్రీమద్భాగవత మహాత్మ్యము కలదు. అదియును సంజీవిని విన్నవించుకొనఁగలదు. శ్రీభాగవతపారాయణ విధానముకూడ వివరముగఁ దెలుపఁగలదు. ఇదివఱకుఁ దెలుఁగునలేదిది. సప్తాహము చేయఁదలఁచినవారు తెలిసికొన దగిన విషయములన్నియు నిందు వివరముగాఁ గరతలామలకముగాఁ దెలుపఁబడి యున్నది)

శ్రీమతే భగవతే వాసుదేవాయ నమః

# స్కాంద పురాణాంతర్గత
# శ్రీమద్భాగవత మాహాత్మ్యము
## ప్రథమాధ్యాయము

*శ్రీ సచ్చిదానంద ఘనస్వరూపిణే, కృష్ణాయచానంతసుఖ వర్షిణే ।*
*విశ్వోద్భవస్థాన నిరోధహేతవే, నుమో వయం భక్తిరసాప్తయే నిశమ్ ॥*

సచ్చిదానంద ఘనమూర్తియు, సౌందర్యమాధుర్యాది గుణములచే నెల్లర మనములఁ దనవైపున కాకర్షించు వాఁడును, సదా సర్వదా యనంత సుఖమును గురియువాఁడును, ప్రపంచోత్పత్తి స్థితి ప్రలయకర్తయు నగు శ్రీకృష్ణభగవానునకు భక్తి రసప్రాప్తికై నిత్యము నిరంతరము ప్రణామము చేయుచున్నాము.

నైమిశారణ్యమునందలి విషయము. సూతుఁడు స్వస్థచిత్తుఁడై తన యాసనమున నుండ, నాసమయమున భగవదమృత మయలీలాకథారస రసికులు, తత్కథారసాస్వాదనమఁ దత్యంతకుశలులు నగు శౌనకాది ఋషులు, సూతునకుఁ బ్రణామ మొనరించి యిట్లని ప్రశ్నించిరి.

**ఋషులు :–** సూతా ! ధీసమేతా ! ధర్మరాజగు యుధిష్ఠిరుఁడు మధురామండలమం దనిరుద్ధనందనుఁ డగు వజ్రుని, హస్తినాపురమునఁ దన పౌత్రుఁడు నుత్తరాపుత్రుఁడు నగు పరీక్షిత్తును రాజ్యాభిషిక్తులఁ జేసి, హిమాలయమునకుఁ బోయిన పిమ్మట వజ్రనాభుఁడును, పరీక్షిన్మహారాజు నేనేమి చేసిరి ? (వజ్రనాభుఁడే వజ్రుఁడు).

**శ్రీసూతుఁడు :–** భగవంతుఁడగు నారాయణుని, నరోత్తముఁడగు నరుని, సరస్వతీ దేవిని, వ్యాసమహర్షిని సేవించి, శుద్ధచిత్తుఁడయి, భగవతత్త్వమును బ్రకాశింపఁజేయు నితిహాసమగు 'జయ'మును పఠింపవలెను. శౌనకాది బ్రహ్మర్షులారా ! ధర్మరాజయిన యుధిష్ఠిరుఁడు తమ్ములగు భీమాదులతో స్వర్గారోహణమునకు హిమాచలమునకుఁ దరలిన పిమ్మటఁ, బరీక్షిన్మహారా జొకనాఁడు మధురకుఁజనెను. ఈ ప్రయాణమందా నరపాలుని యుద్దేశ్యము వజ్రనాభునితోఁ గలసి మెలసి యుండుటయే. తనకుఁ బితృతుల్యుఁ డగు నౌత్తరేయుఁడు తనను జూడవచ్చుచున్నాఁడనిన సమాచారము తెలిసినంతనే వజ్రనాభుని హృదయము ప్రేమభరితమయ్యెను. ఆ వజ్రనాభుఁడు నగరమునుండి బయలువెడలి, యెదురేగి, కరిపురాధీశుని చరణకమలముల కెరఁగి, తన ప్రాసాదమునకుఁ గొని తెచ్చెను. వీరుఁడగు పరీక్షిద్ధరావరుఁడు శ్రీకృష్ణునకుఁ బరమ భక్తశిఖామణి. ఆ నరపతి మనము నిత్యము నిరంతర మానంద ఘనుఁడగు నందనందనునియంద రమించుచుండును. ఆసార్వ భౌముఁడు శ్రీకృష్ణభగవానుని మునిమనువఁడగు వజ్రనాభునతిశయ ప్రేమమునఁ గౌఁగిలించెను. అనంతర మంతిపురమున కుఁ జని, రోహిణ్యాదికాంతల దర్శించి నమస్క రింప, వారును బరీక్షిత్తున కత్యంత సమ్మానము గావించిరి. అందఱును విశ్రాంతిగొని సుఖోపనిష్టులయిన పిమ్మట హస్తిపురసార్వభౌముడుఁ వజ్రనాభునితో నిట్లనెను.

**పరీక్షిత్తు :–** నీ తండ్రితాతలు, నాతండ్రితాతలను పెద్దపెద్ద సంకటములనుండి కాపాడిరి. నా ప్రాణము కాచినవారును వారే ! ప్రియుఁడవగు వజ్రనాభా ! నేను నా యుపకారములకుఁ బ్రతిచేయఁదలచితినేని నావలన నేనాఁటికిని నయ్యెడిపనికాదు కావున నేను నిన్నొక్క టి ప్రార్థించెదను విను. 'నీవు సుఖముగా నీరాజ్యకార్యములఁ జూచుకొనుచుండుము. నీకుఁ గోశము, సేన, శత్రుదమనము మున్నగువాని విషయమున నిసుమంతయుఁ జింతవలదు. నీకొకటి మాత్రమే చేయవలసిన కార్యమున్నది. అదియేమందువా? నీవు నీతల్లులను మిగులఁ బ్రేమమునఁ జక్క ఁగ సేవచేయుచుంటయే. ఎప్పుడేని యేదేని యాపద సంభవించెనేని, లేదా యేదేనికారణమున నీ హృదయమున నధికక్లేశము తోఁచెనేని, నాకుఁ దెలిపి, నీవు నిశ్చింతుఁడవయి యుండుము. నీ చింతలన్నియు నేను బోఁగొట్టెదను'. అని పరీక్షిచ్చక్రవర్తి పలుక వజ్రనాభుఁడు మిగులఁబ్రసన్నుఁడయి యతనితో నిట్లనియె.

**వజ్రనాభుఁడు :–** మహారాజా ! మీరునాతో వచించిన దెల్ల సర్వదా మీకుఁ దగియున్నది. తమజనకుఁడు నాకు విలువిద్దె గఱపి, నాకెంతో యుపకార మొనరించియున్నాఁడు. కావున నాకేవిషయమునను నిసుమంతయ యినఁ జింతలేదు. వారి కృపచే నేను క్షత్రియోచిత శౌర్యవీర్య సంపన్నుఁడనయి యున్నాను. నాకు మాత్ర మొక విషయమునఁ జింతకలదు. వాస్తవమున నది పెద్దదిగులే. కావునఁ దామావిషయముననే యోజింపవలసి యున్నది. ఆ చింతయేమందురా ! నేను మధురా మండలమునకు రాజ్యాభిషిక్తుఁడనయితి నన్నది పేరునకు మాత్రమే ఊరా ! పల్లెయా? నిర్జనమగు వనమున నున్నాను. ఇచటిప్రజ లేమయిరో నాకుజాడయయినఁ దెలియదు. రాజ్య సుఖము ప్రజలుండినకదా.

వజ్రనాభుఁడిట్లు చెప్పఁగానే, పరీక్షిన్మహారా జాతనిసంశయము బాప శాండిల్యమహార్షినిఁ బిలువనంపెను. ఈ శాండిల్య మహర్షియే మొదట నందాదిగోపకులకుఁ బురోహితుఁడు. పరీక్షిత్తు పంపిన సందేశ మందిన వెంటనే, శాండిల్యమహర్షి తన కుటిని వెడలి, యచ్చటకు విచ్చేసెను. వజ్రనాభుఁ డాముని పుంగవునికి యథావిధిగ స్వాగతసత్కా రము లొనరించి, యొకయున్న తాసనమున నాసీనుం గావింపఁ బరీక్షిన్మహారాజు, వజ్రనాభుఁడు దనకుఁ జెప్పినవిషయమును వినిపించెను. అటుపిమ్మట శాండిల్యమహర్షి మిగులనానందించి వారల ననున యించుచు నిట్టులనియె.

**శాండిల్యుఁడు :–** ప్రేమాస్పదులరగు పరీక్షిన్మహారాజా ! వజ్రనాభా ! నేను మీకు వ్రజభూమిరహస్యమును దెలిపెద. సావధానులరయి వినుఁడు. 'వ్రజ' శబ్దమున కర్థము వ్యాప్తి వ్యాపకమయిన కారణముననే యీ భూమికి 'వ్రజ' మని పేరు పడినది. సత్త్వరజ స్తమోగుణముల కతీతుఁడయిన పరబ్రహ్మమే వ్యాపకము ఆ పరబ్రహ్మమూర్తి వ్యాపించినందుననే దానిని 'వ్రజ' మని పిలుతురు. అది సదానందస్వరూపము. పరమజ్యోతి ర్మయము; అవినాశి. జీవన్ముక్త పురుషు లందు నసించెదరు. ఆ పరబ్రహ్మస్వరూపమగు వ్రజధామమునందు శ్రీకృష్ణభగవానుఁడు నివాసము చేయుచుండును. ఆ ప్రభుని ప్రత్యంగము సచ్చిదానందస్వరూపమయినది. ఆ విభుఁ డాత్మారాముఁడు; ఆప్తకాముఁడు. ప్రేమరసమగ్నులగు రసికజనులే వాని ననుభవించుచున్నారు. శ్రీకృష్ణ భగవానున కాత్మశ్రీరాధిక. వానితో రమణ మొనరించు కారణముననే రహస్యరసమర్మజ్ఞులగు జ్ఞానులు వాని నాత్మారాముఁ డందురు. 'కామశబ్దమున కర్థము కోరిక; అభిలాష. వ్రజమున శ్రీకృష్ణభగవానునకు వాంఛిత పదార్థములు, గోవులు, గోపబాలకులు, గోపికలు, వారితో లీలావిహారాదులు. అవన్నియు నిందు నిత్యప్రాప్తములు. ఇందుచే శ్రీకృష్ణు డాప్తకాముఁ డని పిలువఁబడుచున్నాఁడు. శ్రీకృష్ణభగవానుని యీరహస్యలీల ప్రకృతికంటెఁ బరమైనది. ఆ దొర ప్రకృతితోఁ గ్రీడింపఁ దొడఁగినప్పు డితరులు నాప్రభులీల ననుభవించెదరు. ప్రకృతితో నయ్యెడి లీలయందె రజోగుణ సత్త్వగుణ తమోగుణములమూలమున సృష్టి స్థితి ప్రలయములు తోఁచుచుండును. ఈ ప్రకారము భగవల్లీల రెండు విధము లని నిశ్చయమగుచున్నది. ఒకటి వాస్తవలీల; స్వసంవేద్యము. దానిని స్వయముగ శ్రీభగవానుఁడు నాభగవంతుని, రసికభక్తజను లెఱుఁగుదురు. జీవులసమీపమున నయ్యెడిలీల వ్యావహారికలీల. వాస్తవలీల లేక వ్యావహారికలీల కలుగదు. కాని వ్యావహారికలీల కెప్పుడుగాని వాస్తవికలీలా రాజ్యముగా బ్రవేశము కలుగఁజాలదు. మీరిరువురు చూచుచున్నలీల వ్యావహారికలీల, ఈ పృథ్వి, స్వర్గాదిలోకము లీలీలాంతర్గతములు. ఈ భూమిమీఁద, నామధురామండల మున్నది. అదియే వ్రజభూమి. ఇందే భగవానుని యావాస్తవ రహస్య లీల గుప్తరూపమున నగుచుండును. అది యప్పుడప్పుడు ప్రేమ పూర్ణహృదయులగు రసికభక్తులకు సర్వత్ర కానవచ్చుచుండును. ఒకప్పు డిరువదెనిమిదవ ద్వాపరాంతమున భగవద్రహస్యలీల కధికారులగు భక్తజను లిందేకత్ర గూడినప్పు డిది కొలఁది కాలమునకు ముందే జరిగియుండెను'. భగవానుఁడు తన యంతరంగ ప్రేమ భక్తజనులలో నవతార మెత్తు చుండును. ఆ ప్రభుని యవతారమునకుఁ బ్రయోజనము రహస్యలీల కధికారులగు భక్తజనులును, అంతరంగపరికరములతోఁ గలసి మెలసి లీలారసాస్వాదనము చేయఁ జాలుటే. ఈ ప్రకారము భగవానుఁ డెప్పుడెప్పు డవతారమును గ్రహించునో యప్పుడప్పుడు భగవానున కభిమతులును భక్తులునగు దేవతలు ఋషులు మొదలగువారును సర్వత్ర యవతరించెదరు.

ఇప్పుడిప్పుడేయయిన ఈయవతారమున, శ్రీభగవానుఁడు తనప్రియులగు భక్తుల యభిలాష పూర్ణ మొనరించి యిప్పుడే యంతర్ధానుఁడయ్యెను. దీనివలన నిందు మూఁడు తెగల భక్తులు గలరని నిశ్చయమగు చున్నది. ఇట్లు తలఁచుటయందు సందియమున కిసుమంతయిన నవకాశము లేదు. ఈమూఁడు తెగలలోఁ బ్రథమశ్రేణి భక్తులు భగవానుని యంతరంగ నిత్యపార్షదులు. వీరికి భగవానునితో వియోగ మెప్పటికిని కలుగనే కలుగదు. రెండవ తరగతివారు భగవత్ప్రాప్తిని మాత్రమే కోరువారు. వీరంతరంగలీలలలోఁ బ్రవేశమును గోరెదరు. మూఁడవ శ్రేణిలోనివారు దేవతలు మున్నగువారు. వీరిలోనుండి, దేవతలు మున్నగువార యంశలతో నవతరించిన వారిని, భగవానుఁడు వ్రజభూమినుండి తొలఁగించి, మొదటనే ద్వారకకుఁ జేర్చియుండెను. తర్వాత బ్రాహ్మణుల శాపమున యదువంశ సంహారమునకు, సాంబుని కడుపులో ముసలము పుట్టెను. ఆ ముసలపుఁ బొడిచేత నేర్పడిన ముప్వంచుతుంగచే యదువంశీయులందఱు పరస్పరము జగడమాడి యాతుంగను గొని మోఁదుకొని చచ్చిరి. ఈ ప్రకారమా ముసలము నెపమున యదువంశములోఁ బుట్టిన దేవతలను స్వర్గమున కనిపివారివారి యధికారములందు మరల నిలిపెను. అట్లే కేవల భగవత్ప్రాప్తికాము లయిన వారికి బ్రేమానంద స్వరూపులఁ గావించి, శ్రీకృష్ణుఁడు శాశ్వతముగా వారినిఁ దన యంతరంగ నిత్యపార్షదుల గోష్ఠిలోఁ జేర్చుకొనెను. నిత్యపార్షదులగువారలిందు గుప్తరూపమున నయ్యెడి నిత్యలీలలలో సదాయుండినవారయ్యును, వారిని దర్శనము చేయుట కధికారము లేనివారల కదృశ్యులయి యుందురు. వ్యావహారికలీలయం దున్నవారు నిత్యలీలను

దర్శించుట కధికారులుకారు; కావున నిక్క డకు వచ్చువారలకు సర్వత్ర నిర్జనవనము – (సర్వశూన్యము) గాఁ గానవచ్చును. కావున వారు వాస్తవలీలయందున్న భక్తులను జూడఁజాలరు.

కావున వజ్రనాభా ! నీవించుకయయినఁ జింతపడవలదు. నీవు నాయానతిమేర కిచ్చటఁ బెక్కు గ్రామములఁ గట్టింపుము. దీని నిశ్చయముగా నీ మనోరథము సిద్ధింపఁగలదు. శ్రీకృష్ణభగవానుఁ డెక్క డ నే లీలల గావించెనో దాని ననుసరించి యాయూరి కాపేరు పెట్టుము. ఇట్టు లనేకగ్రామముల నిర్మించి వ్రజభూమిని లెస్సగా సేవించుచుండుము. గోవర్ధనము, దీర్ఘపురము (డీగ్) మధుర, మహావనము (గోకులము) నందిగ్రామము (నందగాం) బృహత్సాను (బర్‌సానా) అనుచోట్లనీకయి శిబిరములను నిర్మించుకొనుము. ఆయాస్థానములందుండి, భగవానుని లీలాస్థలములగు నదులు, పర్వతములు, కందరములు (గుహలు), సరోవరములు, కుండములు, కుంజవనములను సేవించుచుండవలెను. ఇట్లు చేయుటచే నీ రాజ్యమునఁ బ్రజలు మిగుల సంపన్నుల కాఁగలరు. నీకును బ్రసన్నత చేకూరఁగలదు. ఈ వ్రజభూమి సచ్చిదానందమయమైనది. దీనికణకణమున శ్రీకృష్ణభగవానుఁడు రమించుచుండును. కావున సర్వవిధములఁ బ్రయత్నపూర్వకముగ దీనిని సేవించుచుండవలెను. నేను నిన్నా శీర్వదించెదను. నాకృపచే భగవల్లీలాస్థలము లన్నియు యథార్థముగ గుఱుతింపఁగలవు. ఇంకొక మహత్తర విషయము దెలిపెదను విను. ఇట్లు నీవు వ్రజభూమిని సేవించుచుంటివేని, నొకకాలమునకు నీకు శ్రీయుద్ధవుల వారితో సమాగమము లభింపఁగలదు. మఱియు నా మహానుభావునివలన నీవును నీ తల్లులును నీవ్రజభూమి యొక్క యు శ్రీభగవానుని లీలల యొక్క యు రహస్యములను దెలియఁగలరు.

మునివరుఁడగు శాండిల్యుఁ డాయిరువుర కీ ప్రకారము బోధించి, శ్రీకృష్ణభగవానుని స్మరణచేయుచుఁ దనయాశ్రమమునకుఁ బోయెను. ఆ మునిపుంగవుని సూక్తులను విని పరీక్షిన్నరపాలుఁడును వజ్రనాభుఁడును జాల సంతసించిరి.

# ద్వితీయాధ్యాయము

## *యమునా శ్రీకృష్ణపత్నుల సంవాదము*

## కీర్తనోత్సవమున ఉద్ధవుఁడు దర్శనమిచ్చుట

**ఋషు లిట్లనిరి :–** సూతా ! మాకిప్పుడిది చెప్పుము. ఆ ప్రకారము పరీక్షిన్మహారాజునకు వజ్రనాభునకు నాదేశ మొసఁగి శాండిల్యముని తన యాశ్రమమునకుఁ జనిన యనంతర మా నృపాలు లిరువురు నెట్టెట్టు లేమేమి చేసిరి?

సూతుఁడిట్లనియె :– పరీక్షిన్మహారాజునకు జీవనదానము ననుగ్రహించింది శ్రీకృష్ణభగవానుఁడే. కావున నట్టి పరమోపకారియగు భగవానుని మనుమఁడగు వజ్రనాభునకై యేమి చేయఁజాలఁడు ! అఖిలభూమండల మున కధీశ్వరుఁడగు పరీక్షిన్నృపాలుని యాజ్ఞ పాలింపనివాఁ డెవడుండఁగలఁడు ! ఆ విష్ణురాతుఁ డింద్రప్రస్థము (ఢిల్లీ) నుండి వేలకొలఁది గొప్పగొప్ప సెట్టులను బిలిపించి, మధురానగరమున నుండుటకు వారికి స్థలము లిచ్చెను. వీరినేగాక మధురామండలమందలి బ్రాహ్మణులను, బ్రాచీనులగు వానరులను (వనములం దుండువారిని), భగవానున కత్యంత ప్రేమాస్పదులగువారిని రావించి, వారాదరింపఁబడఁదగినవారగు టెఱిఁగి, వారికి మధురానగరమున, నుచితములగు వసతులొసఁగి బహూకరించెను. ఈ ప్రకారమౌత్తరేయుని సహాయమున, శాండిల్యముని కృపావిశేషము వజ్రనాభుఁడు, శ్రీకృష్ణభగవానుఁడు గోపగోపీయతుఁడయి సలిపిన నానావిధలీలల కాటపట్టులగు తావులనెల్ల నన్వేషించి తెలియఁగలిగెను. లీలాస్థానముల యథార్థత నెఱిఁగి, యక్క డక్క డ గావించిన లీలల ననుసరించి యాయాస్థలముల కాయా నామకరణములఁ గావించెను. ఆయా చోటుల భగవంతుని పేరు మీఁదఁ గుండములను గూపములను ద్రవ్వించెను. కుంజములను వనములను వేయించెను. శివాది దేవతలను స్థాపించెను. గోవిందదేవ, హరిదేవాది నామములతో భగవద్విగ్రహములను బ్రతిష్ఠించెను. ఈ విధమయిన సత్కా ర్యముల మూలమున వజ్రనాభుఁడు తనరాజ్యమునం దంతట శ్రీ కృష్ణ భక్తినే ప్రచారము గావించి, యత్యంత ప్రసన్న మనస్కుఁడయ్యెను. వారి ప్రజలు నానందపరవశులయి, సదా భగవానుని మధురనామమును లీలలును గీర్తనచేయుటయందే సంలగ్నచిత్తులయి పరమానంద సముద్రమున మునిఁగి, యెల్లప్పుడు వజ్రనాభుని రాజ్యమును బ్రశంసించుచుండిరి.

ఒక దినమున శ్రీకృష్ణ భగవానుని పదునాఱువేలమంది రాణులు తీర్థమాడ శ్రీయమునానదీతటమునకుఁ బోయిరి. వారు నిరంతరము భగవద్విరహవేదనచే వ్యాకులత చెంది యుండిరి. శ్రీయమునయు శ్రీకృష్ణభగవానుని పత్నియే. కాని యామెకు భగవద్విరహతాప మిసుమంతయైన నున్నజాడకానరాదయ్యెను. శ్రీకృష్ణపత్ను లాయమున

మిగులఁ బ్రసన్నయయి యుండుటయు, లోపలినుండి యానందతరంగములు పొంగిపొరలి వచ్చుచుండుటయుఁ గాంచిరి. తమ సవతి యిట్టు లానందమున మునిఁగియుండుటఁ గాంచి వారి హృదయమునకుఁ దాప మధికమయి సరళభావమున నిట్లని యడుగఁజొచ్చిరి.

**కృష్ణపత్నులు :–** అక్కా ! కాళిందీ ! మేమెట్లు శ్రీకృష్ణపరమాత్మకు ధర్మపత్నులమో నీవును నట్టులేకదా. మేమో బర్తృవిరహాగ్నిలోఁ గుమిలిపోవుచున్నాము. తద్వియోగ జనిత దుఃఖమున మా హృదయములు సదమదము లగుచున్నవి. కాని నీ యందిట్టి స్థితి కానరాదు. నీవెంతో సంతోషముతో నున్నావు. ఇందుల కేమికారణము? కల్యాణీ ! మాకించుక తెలుపుమమ్మా !

వారిట్టు లడుగ విని శ్రీయమున నవ్వెను. వెంటనే యాదేవి యిట్లు లని తలపోసెను. 'మత్ప్రియతముఁ డగు శ్రీకృష్ణునకు వీరును పత్నులగుటచే వీరు నాకు దోడఁ బుట్టువులుకదా' యని యామెహృదయము దయచేఁ గరఁగి నీరయ్యెను. అందుచే నామె యిట్టు లని చెప్పఁదొడఁగెను.

**శ్రీయమున :–** తన యాత్మయందు రమించువాఁడు కావున శ్రీకృష్ణభగవానుఁ డాత్మారాముఁడు. ఆ ప్రభుని యాత్మ.

**శ్రీరాధాదేవి :–** నేను దాసివలె నామెను సేవించుచుందును. అవశ్యము వారి సేవాఫలమే యిదియిట్లు ప్రసన్నచిత్తనయి యుండితిని. వారిదాస్యము చేయుటచేతనే విరహశోకము నన్ను సోఁకనైన సోఁకఁజాలకున్నది. శ్రీకృష్ణభగవానున కెందఱు భార్యలు గలరో వారందఱు శ్రీరాధాదేవి యంశజలు. శ్రీకృష్ణభగవానుఁడు, రాధాదేవి సదా యొకరి కొకరు సమ్ముఖమై యుందురు. వారికిఁ బరస్పరము నిత్యసంయోగము కలదు. కావున రాధాదేవి యంశముచేఁ గానవచ్చు శ్రీకృష్ణుని యితరరాణులకు నిత్యసంయోగము ప్రాప్తము. శ్రీకృష్ణుఁడే రాధ. శ్రీరాధా దేవియే శ్రీకృష్ణుఁడు. వారిద్దఱప్రేమయే, వంశి – శ్రీరాధికాదేవి ప్రియసఖి చంద్రావతి; శ్రీకృష్ణ చరణ నఖచంద్రముని సేవయం దాసక్తయగుట చేతనే 'చంద్రావతి' నామముతోఁ బిలువఁబడుచున్నది. శ్రీరాధా కృష్ణులయందా చంద్రావతి కత్యంత లాలసముఁ బ్రేమయుఁ గలదు – కావున నయ్యది వేఱొక స్వరూపమును ధరింపఁజాలదు. నేను శ్రీరాధయందే రుక్మిణిమున్నుగాఁగల వారి సమావేశమును గాంచితిని, మీరును శ్రీకృష్ణునుండి వియోగము గలవారు గారనుట సర్వవిధముల నిశ్చితాంశము. మీరీ వ్యాకులము గలవారయి యున్నారు. ఈ ప్రకారము మొట్టమొదట నక్రూరుఁడు నందగ్రామమునుండి శ్రీకృష్ణుని మధురానగరమునఁ దీసికొనిపోయి నప్పుడు గోపికలకు శ్రీకృష్ణునితోఁ గలిగిన వియోగము వాస్తవిక విరహముగాదు; విరహాభాసము. ఈ యంశము వారికిఁ దెలియ కుండినంతవఱకు వారు మిగులఁ గష్టపడిరి.

శ్రీ ఉద్ధవులు వేంచేసి యీ విషయము బోధించి సమాధానపఱిచినపిమ్మట నీ రహస్యమును దెలయఁ గలిగిరి. ఉద్ధవుల కీ విరహము, విరహాభాసమనియే తెలిపిరి. వాస్తవమున వారికి భగవానునితో నిత్యసంయోగ ముండెను. ఉద్ధవుని సత్సంగము ప్రాప్తమయినచో, మీకును మీప్రియతముఁడగు శ్రీకృష్ణునితో నిత్యవిహారసుఖము ప్రాప్తమగును.

**సూతుఁడు :–** ఋషిగణములారా ! శ్రీకృష్ణపత్నులిట్లు శ్రీయమునా దేవిచేఁ బ్రబోధితలయి, సదా ప్రసన్నయయి యుండెడి యీ తపనతనయతో మరల నిట్లనిరి. "తమ ప్రియతమునితో నిత్యసంయోగ సౌభాగ్యము ప్రాప్తింపఁజేయు నుద్ధవ దర్శన మేయుపాయమున లభింపఁగలదనెడి లాలస వారిమనస్సులం దాసమయమున నుత్క టమయి యుండెను.

**శ్రీకృష్ణపత్ను లిట్లనిరి :–** అక్కా ! నీ జీవనమే ధన్యమైనది; ఏలయందువా ? నీ కెప్పుడును నీ ప్రాణనాథు నెడఁబాసిన దుఃఖ మనుభవింపవలసినది లేదయ్యెను. ఏ శ్రీరాధికా దేవి కృపచే నీ కభీష్టార్థసిద్ధి కలిగెనో, యా యమకు మేము నిప్పుడు దాసీలమయితిమి. కాని నీవు వచించిన శ్రీ యుద్ధవదర్శనము లభించిన యావలఁగాని మామనోరథము పూర్ణముగా నేరదు. కావున నో కాళిందీ ! శ్రీ యుద్ధవులవారి దర్శనము శీఘ్రముగా లభించెడి యుపాయమేదియో మాకుఁ దెలుపుము.

**సూతుఁడు :–** శ్రీకృష్ణభగవానుని రాణులీచందమున సూర్యతనయయగు శ్రీ యమునాదేవి నడుగ, శ్రీభగవంతుఁ డగు శ్రీకృష్ణచంద్రుని షోడశికలలను జింతన మొనరించుచు యమున వారలతో నిట్లనెను. "అక్క లారా ! ఉద్ధవుఁడు శ్రీకృష్ణభగవానుల మంత్రి. భగవంతుఁడీ లీలావిభూతిని విడిచి, తన పరమధామమునకు వేంచేయ సంకల్పించి, తన మంత్రియగు నుద్ధవునిఁ జేరఁబిలిచి" 'ఉద్ధవా ! తపస్సు చేయుటకు యోగ్యమగు స్థలము బదరికాశ్రమము, కావున నీవు సాధన పూర్తి చేసికొనుట కచ్చటకుఁబొమ్ము' అని యాదేశింప, భగవానుని యీ యానతి నౌఁదలఁదాలిచి, యీ సమయమున సాక్షాత్ స్వస్వరూపముతో బదరికాశ్రమమున వేంచేసి యున్నాఁడు. అక్క డకుఁబోవుజిజ్ఞాసులోకమునకు భగవంతుఁడు తనకుఁదెలిపి జ్ఞానము నుపదేశించుచుందును.

సాధనకు ఫలభూమి వ్రజభూమి. దీనిని రహస్యములతో శ్రీకృష్ణభగవానుఁ డుద్ధవునకుఁ బ్రప్రథమముననే కటాక్షించి యుండెను. కాని యా ఫలభూమి, యిక్కడనుండి భగవంతుఁ డంతర్ధానుఁ డయినతోడనే స్థూలదృష్టి కందకుండఁ బోయెను. కావున నిప్పుడిక్కడ నుద్ధవుఁడు ప్రత్యక్షముగా దర్శింపఁబడకుండెను. కాని ఈ యుద్ధవుని దర్శనమయ్యెడి స్థల మొకటి కలదు. గోవర్ధనపర్వత నికటమున భగవానుని లీలా సహచారిణులగు గోపికామ తల్లులు విహారస్థలము కలదు. అందుఁ దంణాంకురవల్లీ రూపమున నుద్ధవులు వేంచేసి యుండిరి. అట్లుండుటకుఁ గారణ మేమన, భగవత్ప్రియతమలగు గోపికాతరుణుల చరణరజము తనపైఁబడుననెడి యాశయే. ఉద్ధవుని సంబంధమున నిశ్చితివిషయ మొండుకలదు. భగవంతుఁడు తన యుత్సవస్వరూపమును నుద్ధవుల కనుగ్రహించి యుండిరి. భగవంతుని యుత్సవము ఉద్ధవునియవయవ భూతము; కావున నాయుద్ధవుఁ డా యుత్సవమును విడిచి వేరుగా నుండడు. కావున నిప్పుడు వజ్రనాభుని వెంటఁగొని యక్కడకుఁబోయి, కుసుమసరోవరము చెంత వసింపుడు. భగవద్భక్తమండలుల నొకచోటఁజేర్చి వీణావేణుమృదంగాదివాద్యములతో భగవన్నామ లీలలఁ గీర్తనము, భగవత్కథాకావ్యశ్రవణము భగవద్గుణ గానముతో సరస సంగీతములతో మహోత్సవమున కారంభము సేయుఁడు. మహోత్సవము విస్తరించి వైభవముగా జరుగునప్పుడు నిశ్చయముగా నక్కడ నుద్ధవదర్శనము మీకయితీరును. ఉద్ధవుఁడే మీ కందఱకు మనోరథపూర్తి చేయఁగలడు.

**సూతుఁడు :-** శ్రీయమునా దేవి తెలిపిన యీవిషయములను విని శ్రీకృష్ణరాణులందఱు మిగులఁ బ్రసన్న చిత్తలయి, కాళిందికిఁ బ్రణామము లర్పించి, యక్కడ నుండి మరలివచ్చి వజ్రనాభ పరీక్షిత్తులతో నీ సమాచారమంతయు సాంతముగాఁ దెలిపిరి. విషయమంతయువిని, పరీక్షిత్తు సంతసించి, వజ్రనాభుని శ్రీకృష్ణ పత్నుల నెల్లర వెంటఁగొని చని యచట నప్పుడేయమునా దేవి వచించిన విధమున నుత్సవమునకుఁ గావలసిన యేర్పాటులన్నియుఁ గావింప నియమించెను. గోవర్ధనగిరి నికటమున బృందావనమునకులోన, కుసుమసరోవర తటము శ్రీకృష్ణప్రియలగు వ్రజసతుల విహారస్థలము. అచటనే శ్రీకృష్ణ సంకీర్తనోత్సవమున కారంభము చేయఁ బడినది.

వృషభానునందిని శ్రీరాధా దేవియుఁ దత్ప్రియతముఁడు నగు శ్రీకృష్ణుని లీలాభూమి సాక్షాత్ సంకీర్తన శోభతో సుసంపన్నమయినంతనే యందున్న భక్తజనులంద ఱేకాగ్రమనస్కు లైరి, వారిదృష్టి, వారి మనోవృత్తి యన్యత్ర పోయినదికాదు. తదనంతర మెల్లరు చూచుచుఁ జూచుచు నుండఁగనే యందలి తృణగుల్మలతా సమూహములోనుండి ప్రత్యక్షమై శ్రీ యుద్ధవులందఱ సమీపమున కేతెంచెను. ఆ యుద్ధవుని తిరుమేను శ్యామ వర్ణముగలిగి యందుపైఁ బీతాంబరము శోభ కనులపండువు చేయుచుండెను. గళమున వనమాలము గుంజా మాలయు ధరించి, శ్రీముఖమున మాటిమాటికి 'గోపి వల్లభుఁ'డగు శ్రీకృష్ణుని మధురలీలలు గానము చేయు చుండెను. ఉద్ధవుని యాగమనమున సంకీర్తనోత్సవ శోభ యెన్ని మడుఁగులో యధికమయ్యెను. స్ఫటికమణి ఖచితాట్టాలక భూమణులపై నిండుపున్నమనాటి పండువెన్నెల పర్విన నెట్లుండునో యట్లు శోభావైభవము వర్ణనాతీతమయి యుండెను. ఆ సమయమున నెల్లవారు నానందసముద్రమున మునిఁగి సర్వమును మఱచి తన్మయులయి చిత్రముల పోలిక నుండిరి. కొంతసేపటికిఁ బిమ్మట దివ్యలోకమునుండి దిగి శరీరస్మృతి కలవారయిన యనంతరము శ్రీ యుద్ధవులు శ్రీకృష్ణభగవానుని స్వరూపమున సన్నిధి ననుగ్రహించి యుండుటఁ జూచి, తమ మనోరథములు పూర్ణమగుటకుఁగాను ప్రసన్నమానసులై యుద్ధవునిఁబూజింప దొడఁగిరి.

# మూఁడవ యధ్యాయము

## శ్రీమద్భాగవతపరంపరా, మాహాత్మ్యము

## భాగవత శ్రవణముచే శ్రోతులకు భగవద్ధామప్రాప్తి

**సూతుఁడు :–** ఉద్ధవుఁ డందు సమావేశమయిన వారలందఱు శ్రీకృష్ణకీర్తనమున నిమగ్నులయి యుండుట చూచి, వారి నందఱను సత్కరించి, పరీక్షిన్మహారాజును గాఢముగఁ గౌఁగలించుకొని యిట్లనియెను.

**ఉద్ధవుఁడు :–** నీ మనసీ శ్రీకృష్ణ కీర్తనోత్సవమునం దానంద మగ్నమయి యుండినది. కాన నీవు ధన్యుఁడవు. నీ యంతఃకరణము సదా కేవలము శ్రీకృష్ణభక్తితోఁ బూర్ణమయియుండినది. శ్రీకృష్ణపత్నులయెడ నీకుఁగల భక్తి వజ్రనాభుని యెడాటమున నీకుఁగల ప్రేమ మెంతయో యానందకరమైన విషయము. తాతా! నీవు సలిపినదంతయు నీ కనురూపమయి యున్నది. శ్రీకృష్ణుఁడే కాదా ! నీకు శరీరము వైభవమును బ్రసాదించిన కరుణామూర్తి. ఆకారణమున నీవా ప్రభుని ప్రపౌత్రునిమీఁద బ్రేమకలిగియుండుట స్వాభావికమే. ద్వారకావాసు లందఱలో వీరే ధన్యవాదమునకుఁ బాత్రులు. శ్రీకృష్ణభగవానుఁ డరునునకు వీరిని వ్రజమున నివసింపఁ జేయ నాజ్ఞనిచ్చియుండిరిగదా ! శ్రీకృష్ణుని మనస్సనెడి చంద్రముఁడు శ్రీరాధావదనకాంతియనెడి వెన్నెలతోఁ గూడి తన లీలాభూమియగు బృందావనమును దనకిరణములతో సుశోభితము జేయుచు నందు సదా ప్రకాశించు చున్నాడు. శ్రీకృష్ణచంద్రుఁడు నిత్యపరిపూర్ణుఁడు. ప్రాకృత చంద్రుని చందమున వృద్ధిక్షయాది వికారము లాతనియందు లేవు. ఆ ప్రభుని షోడశకళలనుండి వేలకొలది చిన్మయకిరణములు వెడలుచుండును. దీనిచేత వేలకొలఁది చిన్మయకిరణములు వెడలుచుండును. దీనిచేత వేలకొలఁది భేదములు కలుగుచుండును. ఈ సమస్తకళలతోఁగూడి నిత్య పరిపూర్ణుడయి శ్రీకృష్ణుఁ డీ వ్రజభూమియందు సదా వేంచేసియుండును. ఈ భూమియందు, ఆ ప్రభుని స్వరూపమునందు అంతరమేమియు లేదు. పరీక్షిన్న రేంద్రా ! ఈ ప్రకారము సమస్త ప్రజవాసులు భగవాని యంగములం దుండినవారే. శరణాగతుల భయమును దూరముగాఁ బాఱఁదోలు వజ్రము భగవానుని దక్షిణపాదమున నెలకొనియున్నది. ఈ యవతారమునందు భగవానుఁడు వీరినందఱకు తన యోగమాయచే నభిభూతులఁ గావించుటచే, నా యోగామాయా ప్రభావమునఁ దమ స్వరూపమును మఱచి సదా దుఃఖములపాలై యున్నారు. ఈ విషయము నిస్సందేహముగా నిట్టిదే. శ్రీకృష్ణచంద్ర ప్రకాశము లేనిదే యెవరికిని స్వరూపజ్ఞానము కలుగఁ జాలదు. జీవులయంతఃకరణమునఁగల శ్రీకృష్ణతత్త్వ ప్రకాశముపై సదా మాయాయవనికపడి యుండును. ఇరువదెనిమిదవ ద్వాపరాంతమున స్వయముగా శ్రీకృష్ణభగవానుఁడ వతరించి, మాయయను తెఱను దొలఁగించును. అప్పుడాప్రకాశము జీవులకుఁ బ్రాప్తమగును. కాని యిప్పుడో యా కాలము దాఁటిపోయినది. కావున నాప్రకాశము ప్రాప్తించుట కింకొక యుపాయము తెలుపఁబడుచున్నది వినుఁడు. ఇరువదెనిమిదవ ద్వాపరమునకంటె నితరమయిన కాలమున. శ్రీకృష్ణతత్త్వ ప్రకాశమును బడయవలె ననెడి యభిలాష మెవరికయినఁ గలుగునేని యది శ్రీమద్భాగవతము నుండియే ప్రాప్తము కాఁగలదు. భగవానుని భక్తులెప్పుడెక్క డ శ్రీమద్భాగవతశాస్త్ర కీర్తన శ్రవణములు చేయుదురో, యప్పుడక్క డ శ్రీకృష్ణభగవానుఁడు సాక్షాద్రూపముతో సాక్షాత్క రించును. ఎక్క డ శ్రీమద్భాగవతమునం దొక శ్లోకముగాని యర్ధశ్లోకముగాని పాఠము జరుగునో, యక్క డ శ్రీగోపికలతో శ్రీకృష్ణభగవానుఁడు సన్నిధి ననుగ్రహించును. పవిత్రమగు నీ భారతవర్షమున మనుష్యజన్మ మెత్తియు నెవఁడు పాపమునకు వశీభూతుఁడయి శ్రీమద్భాగవతమును వినఁడో, యట్టివాఁడు తనచేతులతోఁ దనగొంతున కురిపోసికొని యాత్మహత్య చేసికొనినవాఁడే. ఎవఁడు ప్రతిదినము శ్రీమద్భాగవత శాస్త్రమును సేవించునో యా భాగ్యశాలి, తనతండ్రి, తల్లి భార్య యీ ముగ్గురి వంశములను లెస్సగా నుద్ధరించును. శ్రీమద్భాగవత స్వాధ్యాయశ్రవణముచే బ్రాహ్మణులకు విద్యాప్రాప్తి కలుగును. క్షత్రియులకు శత్రువిజయము చేకూరును. వైశ్యులకు ధనము, శూద్రులకు సుఖము లభించును. స్త్రీలకు అంత్యజులకుఁ దదితరులకును శ్రీమద్భాగవతము వలననే వాంఛాపూర్తి కలుగఁగలదు. కావున నిత్యము శ్రీమద్భాగవతము సేవింపని భాగ్యవంతుండగు పురుషుఁడెవఁడుండును? భాగవతమునుండి భగవత్ప్రకాశము కలుగును; దాని వలన భగవద్భక్తి యుత్పన్నమగును. పూర్వకాలమున సాంఖ్యాయనునికృపచే శ్రీమద్భాగవతము బృహస్పతికి లభించెను. బృహస్పతి నా కనుగ్రహించెను. దీనిచే నేను శ్రీకృష్ణభగవానునకుఁ బ్రియతముఁడనగు నెచ్చలి నయితిని. పరీక్షిన్మహారాజా ! బృహస్పతి నాకొక యాఖ్యాయికనుగూడ వినిపించెను. దానిని జెప్పెద వినుము. ఆ యాఖ్యాయిక వలన శ్రీమద్భాగవత శ్రవణ సంప్రదాయక్రమ మెఱుఁగననగును.

**బృహస్పతి :–** వత్సా ! తన మాయచేఁ బురుషరూపమును ధరించెడి శ్రీకృష్ణభగవానుఁడు సృష్టిచేయ

సంకల్పింపఁగానే, యా ప్రభుని దివ్యవిగ్రహమునుండి ముగ్గురు పురుషులు ప్రకటమయిరి. వీరిలో రజోగుణ ప్రధానుఁడయి బ్రహ్మ, సత్త్వగుణము ప్రధానముగాఁ గలిగి విష్ణువు. తమోగుణప్రధానతచే రుద్రుఁడును నుదయించిరి. భగవానుఁడీ మూవురను గ్రమముగా జగదుత్పత్తిపాలన సంహారములు చేయుట కధికారులుగా నియమించెను. అప్పుడు భగవానుని నాభీకమలమునం దుదయించిన బ్రహ్మతన మనోభావమును భగవంతునితో నిట్లని వెల్లడించెను.

**బ్రహ్మ :–** పరమాత్మా ! నారమనఁగా జలము. ఆ జలము నందు శయనించిన కారణమున 'నారాయణుఁడ' నను తిరునామముతోఁ బ్రసిద్ధుఁడవయియున్నావు. అఖిలమున కాదికారణుఁడవగుటచే నాదిపురుషుఁడవు. అట్టి నీకు నమస్కారము. నన్ను సృష్టికార్యమున నియమించితివి. అత్యంత పాపస్వభావము గలది రజోగుణము. సృష్టిచేయు కాలమున నది నీ స్మరణమున కెక్కడ బాధ కలిగించునో యని భయముగా నున్నది. కావునఁ గరుణించి నీ స్మరణము నిరంతరము నాకుండునట్టి విషయము ననుగ్రహింపుము.

**బృహస్పతి :–** ఈ ప్రకారము బ్రహ్మ ప్రార్థనచేయఁగాఁ బూర్వకాలమున భగవానుఁ డా నలువకు శ్రీమద్భాగవతము నుపదేశించి 'బ్రహ్మ ! నీవు నీ మనోరథసిద్ధికై సదా దీనిని సేవించుచుండు' మని చెప్పెను. పితామహుఁడు భగవంతునివలన శ్రీమద్భాగవతము నుపదేశమునుబొంది, మిగులఁబ్రసన్నుఁడయి శ్రీకృష్ణ నిత్యప్రాప్తికిని, స్తావరణభంగమునకును శ్రీమద్భాగవత సప్తాహపారాయణము గావించెను. సప్తాహ యజ్ఞవిధి ననుసరించి యేడుదినముల దనుక శ్రీమద్భాగవతమును సేవించుటచే బ్రహ్మకు సర్వమనోరథములు పూర్ణము లయ్యెను. దీనిచేఁ గమలసంభవుఁడు సదా భగవత్స్మరణ పూర్వకముగ సృష్టి కార్య మొనరించుచు, సారెసారెకు సప్తాహయజ్ఞముల ననుష్ఠించుచుండెను. బ్రహ్మవలెనె, విష్ణువుకూడఁ దన యభీష్టసిద్ధికయి పరమపురుషుఁడగు పరమాత్మను బ్రార్థనచేసెను. ఏలనన బురుషోత్తముఁడా విష్ణువునుసయితము బ్రజాపాలన కార్యము నందు నియమించెను.

**విష్ణు :–** దేవా ! నేను మీ యాజ్ఞానుసారము కర్మజ్ఞాన ప్రయోజనముకై ప్రవృత్తి నివృత్తిమార్గముల యథోచితముగఁ బ్రజాపాలనము చేసెదను. కాలక్రమమున నెప్పుడెప్పుడు ధర్మమునకు హానికలుగునో యప్పు డప్పు డనేకావతారములెత్తి మరల ధర్మమును స్థాపించెదను. భోగమును వాంఛించువారికి, వా రొనరించిన యజ్ఞాదికర్మములకుఁ దగినట్లు ఫలము నొసఁగెదను. సంసార బంధమునుండి ముక్తులు కాఁగోరెడి విరక్తులకు వారివారి యిచ్ఛానుసారము, సారూప్యాది పంచవిధముక్తులను కూడ నిచ్చెదను; కాని మోక్షము గూడఁ గోరని పరమైకాంతుల నేవిధముగఁ బాలనము చేయఁ గలను? ఇది మనస్సుల రాలేదు. ఇంతేగాక నన్ను లక్ష్మిని నెట్లు రక్షించుకొనఁగలను? దీని కుపాయమును దెలుపుము.

విష్ణు వొనరించిన ప్రార్థనను విని యాదిపురుషుఁడగు శ్రీకృష్ణభగవానుఁ డా విష్ణువునకును శ్రీమద్భాగవ తము నుపదేశించి 'నీవు నీ మనోరథసిద్ధికయి సదా యీ శ్రీమద్భాగవత శాస్త్రమును బాఠము చేయు' మని చెప్పెను. ఈ యుపదేశముచే విష్ణుభగవానుని చిత్తము ప్రసన్నమయి, శ్రీలక్ష్మీదేవితో, గూడి ప్రతిమాసమునందు శ్రీమద్భాగవతమును జింతనము చేయసాగెను. ఇందుచేతఁ బరమార్థపాలనము, యథార్థరూపమున బ్రపంచ రక్షణము చేయఁగలిగెను. శ్రీవిష్ణు భగవానుఁడు స్వయముగాఁ దానేవక్తయై శ్రీమద్భాగవత కథను వచింప శ్రీలక్ష్మీదేవి వినుచుండెడిది. అప్పుడు ప్రతిసారి భాగవతకథాశ్రవణ మొక మాసములోనే సమాప్త మయ్యెడిది. కాని శ్రీలక్ష్మీదేవి కథనువచింప, విష్ణువు శ్రోతగానుండి వినుచుండెడివాఁడు. అప్పుడు శ్రీమద్భాగవత కథారసా స్వాదనము రెండు నెలలు పట్టుచుండెను. ఆ సమయమున కథ మిగుల సుందరముగను, నత్యంత రుచికరముగ నుండుచు వచ్చెను. దీనికిఁ గారణమేమనఁగా : విష్ణువో యధికారారూఢుఁడు, జగద్రక్షణచింత చేయవలసిన వాఁడుగా నుండెను. లక్ష్మీదేవి కాజంజాట మిసుమంతయులేదు. కావున నా యమ హృదయము నిశ్చింతగా నుండెను. ఈ కారణమున లక్ష్మీదేవి శ్రీముఖము నుండి భగవత్కథారసాస్వాదన మతిమాత్రముగ నుండును వచ్చినది. అనంతరము రుద్రుఁడును, తాను బ్రథమమున సంహారకార్యమున నియమింపఁబడినవాఁడు కావున నా కార్యమున సమర్థత హెచ్చుగాఁ గలుగుటకు పరమపురుషుఁ డగు శ్రీకృష్ణభగవానునిఁ బ్రార్థించెను.

**రుద్రుఁడు :–** "నా ప్రభో ! దేవదేవా ! నాయందు నిత్య. నైమిత్రిక, ప్రాకృతప్రలయము లొనరింప శక్తులు గలవు. అత్యంతిక సంహారమునకు శక్తి నాయందు లేనేలేదు. ఇదినాకు మిక్కిలి దుఃఖకరమై యున్నది. ఈ లోటు తీరుటకు నిన్నుఁ బ్రార్థన చేయుచున్నాను.

రుద్రుని వేఁడికోలు విని, శ్రీమన్నారాయణుఁ డతనికి శ్రీమద్భాగవత ముపదేశించెను. సదాశివుఁడగు రుద్రుఁ డొక సంవత్సరమువఱకు భాగవతకథను సేవించెను. దీనిని సేవించుటచే రుద్రుఁడు తమోగుణముపై విజయమును సంపాదించి యాత్యంతిక సంహారమునకు శక్తినిగూడఁ బొందెను.

**ఉద్ధవుఁడు :–** శ్రీమద్భాగవత మాహాత్మ్య సంబంధమున నీ యాఖ్యాయికను నేను నా గురవగు బృహస్పతివలన వింటిని. వారివలన శ్రీమద్భాగవతము నుపదేశమును బొంది, యా మహానుభావుని చరణములకుఁ బ్రణామము లర్పించి ప్రసన్నచిత్తుఁడనయి యావల శ్రీవిష్ణుభగవానుఁ డెట్లు భాగవతకథను సేవించెనో, యట్టే నేనును ఒక మాసమువఱకు శ్రీమద్భాగవత కథను లెస్సగా రసాస్వాదన గావించితిని. అంత మాత్రాననే నేను శ్రీకృష్ణభగవానునకుఁ బ్రియతముఁడగు చెలికాఁడ నయితిని. దీనికిఁ బిమ్మట భగవానుఁడు నన్ను వ్రజమునఁ దనకు ప్రియతమలగు గోపికల సేవింప నియమించెను.

భగవానుఁడు తనలీలాపరికరములతోఁగూడి నిత్యవిహారము సల్పుచుండిన కారణమున గోపికలకు శ్రీకృష్ణమూర్తితో నెప్పుడును నెడఁబాటు కలుగదు. అయినను, భ్రమపాయి విరహవేదన ననుభవించుచుండెడి గోపికలకు భగవానుఁడు నా మూలమున భాగవత సందేశమును బంపెను. ఆ సందేశమును తమ బుద్ధి ననుసరించి గ్రహించి గోపీమతల్లులు తమ విరహవేదననుండి ముక్తులయిరి. నేను భాగవతరహస్యము నేమో యెఱుఁగఁజాల నయితినిగాని దానిచమత్కా రము ప్రత్యక్షముగాఁ జూడఁగంటిని. దీనికిఁ జాలకాలమున కావల బ్రహ్మాది దేవతలువచ్చి, భగవానుని పరమధామమునకు విచ్చేయవలసినదని ప్రార్థనచేసి వెడలిపోయిరి. ఆ సమయమున నశ్వత్థవృక్ష మూలమునఁ దనసన్నిధిని నిలఁబడియున్న నాకు, భగవానుఁడు శ్రీమద్భాగవత విషయమున ఆ రహస్యమును తానే యుపదేశించి, నా బుద్ధియందది దృఢముగా నాటుకొనునట్లు చేసెను. దాని ప్రభావమున నేను బదరికాశ్రమ మందుండియు నిక్క డ తృణలతా కుంజములందు నివాసము చేయుచు న్నాను. దాని బలముచే నిక్క డ నారదకుండమున సదా స్వేచ్ఛాను సారముగా విరాజమానుఁడయి యున్నాను. భగవంతుని భక్తులకు శ్రీమద్భాగవత సేవనముచే శ్రీకృష్ణతత్త్వప్రకాశము ప్రాప్తముకాఁగలదు. ఈ కారణమున నిందు సమావేశమున ఈ భక్తజనుల కార్యసిద్ధికయి నేను శ్రీమద్భాగవతపాఠ మొనరించెదను. కాని యీ కార్యమున మీరే నాకు సాయపడవలెను.

**సూతుఁడు :–** ఈమాటలను విని పరిక్షిత్తు యుద్ధవునకుఁ బ్రణామమాచరించి యిట్లని విన్నవించెను.

**పరీక్షిత్తు :–** హరిదాసా ! ఉద్ధవా ! మీరు నిశ్చింతగా శ్రీమద్భాగవతకథను గీర్తన మొనరింపుఁడు. మీకు మావలనఁ గావలసిన సాయమెట్టిదో యానతిండు.

**సూతుఁడు :–** పరిక్షిజ్జనపాలుఁడాడిన యా మాటల నాలించి యుద్ధవుఁడు తనలోఁదాను మిగుల నానందించి యిట్లనియె.

**ఉద్ధవుఁడు :–** రాజా ! శ్రీకృష్ణభగవానుఁ డీ పృథివీతలమును బరిత్యజించిన నాఁటినుండియు, నిక్క డ యత్యంత బలవంతుఁడగు కలి ప్రభుత్వము ప్రబలిపోయినది. ఈ శుభానుష్ఠాన మిందుఁ బ్రారంభమయినది చూచి యోర్వక బలవంతుఁడగు కలి దీనికి సుమహద్విఘ్నములు కలిగింపఁగలఁడు. కావున నీవు దిగ్విజయమున కయి పొమ్ము. కలిని గెలిచి నీ వశపఱుచు కొనుము. ఇక్క డ నేను నీ తోడ్పాటున వైష్ణవీ రీతి నాశ్రయించి, యొక మాసమువఱకు శ్రీమద్భాగవతకథా రసాస్వాదనము చేయించెదను. ఈ విధముగా భాగవతకథా రసప్రసార మొనరించి, యీ శ్రోతల నందఱను భగవంతుఁడగు మధుసూదనుని నిత్యగోలోకధామమున కనిపెదను.

**సూతుఁడు :–** ఉద్ధవుని మాటలువిని పరిక్షిన్మహారాజు మొదట కలిని జయించుటకయి యుబలాట పడెనుగాని తర్వాత భాగవతకథ వినుటకుఁ బ్రాప్తిలేకుండఁ బోవునే యని యోజించి చింతాకులిత హృదయుఁడయి తన యభిప్రాయమును నుద్ధవున కిట్లని విశదపఱచెను.

**పరీక్షిత్తు :–** తాతా ! తమ యాజ్ఞానుసారము తత్పరుఁడనయి నేనో కలియుగము నవశ్యము గెలిచి వశము చేసికొనెదను. గాని శ్రీమద్భాగవత ప్రాప్తి నాకెట్లు కలుగఁగలదు? నేనును మీ శ్రీచరణముల శరణు చొచ్చుచున్నాను. నాయందును మీరనుగ్రహము చూపవలెను.

**సూతుఁడిట్లనియె :–** ఆ మాటలను విని యుద్ధవుఁడు మరల నిట్లనియె.

**ఉద్ధవుఁడు :–** రాజా ! నీవో, యే విషయములోను విచారము పెట్టుకొనవలదు. ఏలయందువా? ఈ భాగవత శాస్త్రమునకుఁ బ్రధానాధికారివి నీవే. ప్రపంచమున మానవులు, నానాప్రకారములగు కర్మములలోఁ దగుల్కొని తగ్గిసముగ్గిస లాడుచున్నారు. వీరి కీక్షణమువఱకు భాగవత శ్రవణము మాటయే తెలియదు. నీ ప్రసాదముచేతనే యీ భారతవర్షము నందుండు మనుష్యులలో నధికాంశము. శ్రీమద్భాగవత కథా ప్రాప్తికల వారయిన మీఁదట నిత్యుఁడు సనాతనుఁడు సుఖస్వరూపుఁడు నగు నా పరమాత్ముని బ్రాపించెదరు. మహర్షియు భగవంతుఁడు నగు శ్రీశుకదేవుఁడు సాక్షాత్ నందనందనుఁడగు శ్రీకృష్ణస్వరూపుఁడు. ఆ మహాత్ముఁడే నీకు శ్రీమద్భాగవతకథను వినిపింపఁగలఁడు : ఇందుసందియ మించకంతైన లేదు. రాజా ! యాకథను వినుటచే నీవు వ్రజేశ్వరుఁడగు శ్రీకృష్ణనిత్య ధామమును బడయఁగలవు. దీనికిఁ బిమ్మట నీ భూమిమీఁద శ్రీమద్భాగవత

కథాప్రచారము జరగఁగలదు. కావునఁ బరీక్షిన్న రేంద్రా ! నీవు పొమ్ము కలిని గెలిచి నీవశము చేసికొమ్ము.

**సూతుఁడు :–** ఉద్ధవుఁ డీ ప్రకారము చెప్పినమీఁదట పరీక్షిన్నృపాలుఁ డతనికి బ్రదక్షిణించి, ప్రణామము సమర్పించి దిగ్విజయమునకు బయలుదేఱెను. ఇక్క డ వ్రజనాభుఁడు తన పుత్రుఁ బ్రతిబాహువును దన రాజధానియగు మధురకు రాజుగాఁజేసి, తల్లులను వెంటగొని, యుద్ధవుఁడు దర్శనమొసఁగిన యా స్థలమునకు శ్రీమద్భాగవతకథ శ్రవణము చేయుట కయి చని యందు నివసించెను. తదనంతర ముద్ధవుఁడు బృందావనమున గోవర్ధనపర్వతమునకు దావున నొక నెలవఱకు శ్రీమద్భాగవతకథారసధార ప్రవహింపజేసెను. ఆ రసాస్వాద నము చేయు సమయమునఁ బ్రేమవిహ్వలులగు శ్రోతలదృష్టి యందు సర్వత్ర భగవానుని సచ్చిదానందమయ లీల తోఁచుచుండెను. అంతటను శ్రీకృష్ణచంద్రుని సాక్షాత్కా రము కాఁజొచ్చెను. ఆ సమయమున శ్రోతలందఱు తాము భగవత్స్వరూపమున నుండుటఁ గనిరి. వ్రజనాభుఁడు శ్రీకృష్ణపరమాత్మ దక్షిణచరణకమలమునఁ దానుండుటఁ గాంచి, శ్రీకృష్ణవిరహశోకమును విడిచి యా స్థానమున నత్యంతయు సుశోభితుఁడు కాఁజొచ్చెను. రోహిణి మున్నుగాఁగల యా వజ్రనాభుని తల్లులును రాసరజనియందుఁ బ్రకాశించుచుండెడి శ్రీకృష్ణచంద్రుని దివ్యమంగళ విగ్రహమునందుఁ గళలవలెను, బ్రభా రూపమునను నుండుట దిలకించి మిగుల విస్మితలయి, తమప్రాణ ప్రియుని నెడఁబాసిన తీరనిదుఃఖమును, బాసి, యా ప్రభుని పరమధామమును బ్రవేశించిరి. వీరుగాక యందున్న తక్కుంగల శ్రోతృగణమును, భగవానుని నిత్యాంతరంగలీలయందుఁ గలిసిపోయి, ఈ వ్యావహారిక స్థూలజగత్తునుండి తత్కా లమున నంతర్ధానమయ్యెను. వారందఱు సదా గోవర్ధన పర్వత కుంజ, తరులందును బృందావనము కామ్యవనము మున్నగు వనములందును, నందున్న దివ్యగోబృందముల నడుమను శ్రీకృష్ణునితో విహరించుచు, ననంతానందానుభవము చేయుచుండిరి. శ్రీకృష్ణప్రేమమున మగ్నులయ్యున్న భావుక భక్తులకు వారి దర్శనమును నగుచుండెను.

**సూతుఁ డిట్లనియె :–** ఎవ రీ భగవత్ప్రాప్తి కథ వినెదరో, వినిపించెదరో, వారు భగవల్లాభమును జెందెదరు. వారి దుఃఖము లన్నియు హానిచెందును.

# నాలుగవ అధ్యాయము

## శ్రీమద్భాగవతస్వరూపము, ప్రమాణము, శ్రోతృ, వక్తృలక్షణము, శ్రవణవిధి, మాహాత్మ్యము

**శౌనకాదిఋషు లిట్లని యడిగిరి :–** సూతా ! నీవుమాకుఁ జక్క ని విషయములను వినిపించితిని. నీ కాయుర్వృద్ధి యగుఁ గాత ! నీవు చిరంజీవి నయ్యెదవు. మా కీప్రకారము చిరకాలము దనుక నుపదేశములఁ జేయుచుండుము. నేఁడు మాకు నీవు శ్రీమద్భాగవతము యొక్క యపూర్వమాహాత్మ్యమును వినిచితివి. సూతా! మాకిప్పుడిది తెలుపుము. శ్రీమద్భాగవత స్వరూపమేమి? దాని ప్రమాణమెంత? అనఁగా శ్లోకసంఖ్య ఎంత? ఏ విధి ననుసరించి దానిని శ్రవణము చేయవలెను? శ్రీమద్భాగవత వక్తృలక్షణమెట్టిది? శ్రోతల లక్షణ మెద్ది? అనఁగా కథ చెప్పువాఁడు, వినువార లెట్లుండవలెను?

**సూతుఁ డిట్లనియె :–** ఋషులారా ! వినుఁడు. శ్రీమద్భాగవతము యొక్క యు శ్రీ భగవానుని యొక్క యు స్వరూపము సదా యెకటియే. ఆ స్వరూపము సచ్చిదానందమయము. మఱియును మీరు భాగవతముయొక్క విశేష స్వరూపమును వినఁగోరెదరేని యిదిగోఁ జెప్పెద. సావధానులరయి వినుఁడు. శ్రీకృష్ణభగవానునియం దెవరికిఁ బ్రేమ మగ్గలమో, యాభావుకభక్తుల హృదయమందలి భగవానుని మాధుర్యభావము నభివ్యక్తము చేయునట్టియు, నా మధురాధిపతి మాధుర్య రసము నాస్వాదన చేయించునట్టియు సర్వోత్కృష్టములగు శ్రీసూక్తులే శ్రీమద్భాగవతమని తెలియుఁడు. ఏ సూక్తులు జ్ఞాన, విజ్ఞాన, భక్తి, వీని కంగభూతములగు సాధనచతుష్టయమును బ్రకాశింపఁజేయునో, ఎయ్యవి మాయను మర్దనము చేయుటయందు సమర్థములో, యవియే మీరు భాగవతమని తెలియుఁడు. శ్రీమద్భాగవత మనంతాక్షరస్వరూపము. దీని నియతప్రమాణ మెవ్వఁ డెఱుఁగగలఁడు? పూర్వకాలమున భగవంతుఁడు శ్రీమహావిష్ణువు బ్రహ్మకు నాలుగు శ్లోకములలో దీనిని దిగ్దర్శనమాత్రముగా నుపదేశించెను. ఈ భాగవత మనెడి యపారకూపారమున మునిఁగి యందుండి తమ యభీష్టవస్తువును బొందుటలోఁ గేవలము బ్రహ్మ, విష్ణు, శివాదులే సమర్థులు, తక్కి నవారు కారు. కాని ఎవరి బుద్ధియు వృత్తులు పరిమితములో, యట్టి మనుష్యుల హితసాధనకయి శ్రీవ్యాసుల వారు పరీక్షిచ్ఛుక సంవాదరూపమున దేనిని గానము చేసిరో దానిపేరు శ్రీమద్భాగవతము. దాని శ్లోకసంఖ్య పదునెనిమిది వేలు. ఈ భవసాగరమునఁ గలియనెడి మొసలి నోటిలోఁ జిక్కు పడిన ప్రాణికి, శ్రీమద్భాగవతమే తోడు.

ఇప్పుడు శ్రీకృష్ణభగవానుని కథ నాశ్రయించు వారలను గుఱించి చెప్పెదను వినుఁడు. శ్రోతలు, ప్రవరు (ఉత్తము)లు, అవరు (అధము)లు, అని రెండువిధములు. ఉత్తమ శ్రోతలలో చాతక, హంస, శుక,

మీనాది భేదములు గలవు. అవర శ్రోతలలో వృక, భూరుండ, వృష, ఉష్ట్రాది భేదము లనేకములు గలవు. చాతకమనునది నీటికోకిల యనెడి పక్షివిశేషము. మేఘమునుండి పడెడి నీటిబిందువులనే తక్క నేలమీదఁ బడిన నదీ తటాకాది జలాశయమందలి నీటిని ముక్కు వంచి ముట్టనేముట్టదు. ఇటులనే సర్వమును బరిత్యజించి కేవలము శ్రీకృష్ణసంబంధమయిన కథ శాస్త్రమునే శ్రవణముచేయుట వ్రతముగా దీక్షవహించిన శ్రోతలు, చాతక శ్రేణితోఁ బరిగణింపఁబడెదరు. హంస పాలు నీరు కలిసి యేకమయి యున్నప్పుడు యచ్చపుఁ బాలనే గ్రహించి, నీటిని వదలి వేయును. అట్లే యనేక శాస్త్రములను శ్రవణము చేసియు, వానియందు సారాంశమునే ప్రత్యేకముగా గ్రహించువారు, హంసలు, చక్క cగా జదివింపఁబడిన శుకము, తన మధుర వాక్కు లతో శిక్షకులను, తనదగ్గరకు వచ్చువారలను నానందింపఁ జేయును. అటులనే యే శ్రోత కథావాచకుఁడు వ్యాస భగవానుని శ్రీముఖమునుండి యుపదేశమును బడసి దాను విన్న దానిని సుందరపరిమితవాణితో మరల వ్యాసుని, తదితర శ్రోతలను నత్యంతానందరసమున ముంచి తేల్చునో యతఁడు శుక శ్రేణిలోఁ జేరును. క్షీర సాగరమునందు మీనము మౌనమూని నిర్నిమేషమగు చూపుతోఁ జూచుచు సదా దుగ్ధమును బానముచేయు చుండును. ఆ విధముగానే కథ విను సమయమున ఱెప్పవాల్పక చూచుచు, నోటినుండి యొక శబ్దమైనను బయటకు రానీక, నిరంతరము కథారసాస్వాదనము చేయుచుండు ప్రేమగల శ్రోత 'మీన' మనఁబడును. ఇప్పుడు ఉత్తమ శ్రేణిలోఁ జేరిన శ్రోతలను గుఱించి వివరించితిని. ఇఁక నవర (అధమ) శ్రోతల భేదముల వర్ణించెద వినుఁడు. 'వృక' మనఁగాఁదోఁడేలు. అడవిలో మధురమగు వేణునాదమునకుఁ జొక్కి తన్మయతను జెందియున్న మృగముల నడలఁజేయు బెడిదవుటులివును బఱపు తోఁడెలువలె, కథాశ్రవణ సమయమున రసికులగు శ్రోతల నుద్విగ్నులఁ జేయుచు నడుమ నడుమ బిగ్గరగా నఱచుచు మాటలాడు మూర్ఖుఁడు 'వృక' మనఁబడును. హిమాచల శిఖరమున 'భేరుండ' మను నొక జాతి పక్షి కలదు. అది యెవరైన పలికిన పలుకులు విని యాప్రకారముగానే పలుకును. కాని యా పలుకులవలని ప్రయోజన మిసుమంతయునది పొందఁజాలదు. అట్టులే, తాను గురువులవలన నుపదేశమును పొంది, దాని నితరులకు నేర్పునేగాని స్వయముగా నాచరణ యందుంచుకొని తానులాభముబడయఁజాలనివాఁడు 'భేరుండ' జాతిలోనివాఁడు. వృషమనఁగా నెద్దు. దానిముందు వేసిన మధురమగు ద్రాక్ష ఫలములను చేఁదుగల ముషిణియాకు మున్నగువానిని వివేకమూని రెంటి నొకవిధముగానే భక్షించును. ఆ ప్రకారమే తాను వినిన విషయముల నన్నియు గ్రహించునేకాని యందు సారమేది యసారమేది యనెడి విచారముచేయు నసమర్థుఁడయి యుండు శ్రోత 'వృష' మనఁబడును. ఒంటె తీయని మామిడిని వదలి వేఁపాకునే మేయునట్లు భగవానుని మధురకథలను మాని, తద్విపరీతములగు సంసారవిషయములందే రమించువాఁ డుష్ట్రజాతికిఁ జేరినవాఁడుగాఁ బరిగణింపఁబడును. ఉత్తమాధమ భేదములలోఁ గొన్నిటినిమాత్రమే యిందుఁ దెలిపితిని. ఇవిగాక యింకను ప్రవరావర శ్రోతలలో 'భ్రమర' గార్ద బాది భేదము లనేకములు గలవు. ఈ భేదములన్నియు నా శ్రోతలకు స్వాభావికములగు నాచార వ్యవహారము లను బట్టి పరికింపనగును.

వక్తసన్నిధిలో విధివంతముగాఁ బ్రణామము సమర్పించి కూర్చుండి ఇతర సంసారవిషయములను వదలి, కేవలము భగవానుని లీలాకథలను వినుటయందే ఇచ్ఛకలిగి, గ్రహించుటయం దత్యంత కుశలుఁడయి, నమ్రుఁడయి, చేతులు జోడించి, శిష్యభావముతో నుపదేశమును గ్రహించువాఁడయి, లోన శ్రద్ధ విశ్వాసములు పూని, వినినదానిని మరల మరలఁ జింతనచేయుచుఁ, దెలియని విషయము నడిగి తెలిసి కొనుచుఁ బవిత్ర భావముతో నుండి, సదా శ్రీకృష్ణభక్తులమీఁద బ్రేమకలిగి యుండునతఁడు శ్రోతలలో నుత్తమశ్రోతయని వక్తలు చెప్పెదరు. ఇక వక్తృలక్షణము వర్ణించెద వినుఁడు. సదా భగవంతునియందు లగ్నమయి, ఏ వస్తువునందును నపేక్షలేక, సర్వసుహృదుఁడయి దీనులయెడ దయగలవాఁ డయి, యనేక యుక్తులతోఁ దత్త్వమును బోధచేయుట యందుఁ జతురుఁడయియుండు వక్తను మునులును సన్మానము చేయుదురు.

విప్రులారా ! ఇఁక నేను భారతవర్షమునందు శ్రీమద్భాగవత సేవనమున కావశ్యకమగు విధానమును దెలిపెదను సావధానముగా వినుఁడు. ఈ విధిని బాలించుటచే శ్రోతకు సుఖపరంపర విస్తరించి కలుగఁగలదు. శ్రీమద్భాగవత సేవనము నాలుగు విధములు : సాత్త్వికము, రాజసము, తామరసము, నిర్గుణము అని. ఒక యజ్ఞమునకువలెఁ బ్రయత్నముచేసి, బహువిధ పూజాసామాగ్రుల మూలము నత్యంత శోభా సంపన్నముగాఁ దోఁప, మిగులఁ బరిశ్రమ చేసి యుత్సాహముతో నేఁడుదినములలోనే సమాప్తి చేయఁబడునో, యదియు బ్రసన్నతా పూర్వకముగఁ జేయఁబడినదగునో యట్టి శ్రీమద్భాగవతసేవనము 'రాజస' మనఁబడును. ఒకటిగాని రెండు గాని నెలలలో, నెమ్మదినెమ్మదిగా, కథారసము నాస్వాదించుచు నెట్టి పరిశ్రమకు లోనుగాక చేయు శ్రవణ మెద్దికలదో, పూర్ణానందవర్ధక మగునది సాత్త్విక సేవన మగును. తామస సేవన మెట్టిదనఁగా, ఒకప్పు డేమఱుపాటున మఱచి కొంతకాలము మాని, జ్ఞాపకమునకు వచ్చినప్పుడు మొదలు పెట్టుచు నీప్రకార మొక

సంవత్సరమువఱకు ఆలస్యము అశ్రద్ధతో కథనడచునది. ఈ 'తామససేవనము' బొత్తుగా మానివేయుట కంటె, మేలు, సుఖమునే కలిగించునది. సంవత్సరము మాసము దినములను నియమనిర్బంధములు లేక సదా ప్రేమ, భక్తితోఁ గూడి చేయు శ్రవణము 'నిర్గుణ' సేవనముగాఁ దెలియవలెను. పరీక్షిన్మహారాజు, శుకమహర్షికి జరిగిన ఈ సంవాదరూపమయిన భాగవతసేవనము కూడ నిర్గుణమయినదిగానే తెలుపఁ బడినది. ఇక్క డ ఏడు దినములను విషయము, రాజుగారి యాయుర్దాయపరిమితి ననుసరించిన లెక్క గాని, సప్తాహకథా నియమములకయి యేర్పడినది కాదు.

భారతవర్షముగాక తదితర స్థలముందును త్రిగుణ (సాత్త్విక,రాజస, తామస) సేవనముగాని, నిర్గుణ సేవనము గాని వారి వారి రుచి ననుసరించి చేయవలెను. తాత్పర్య మేమనగా, నేవిధముగా నయినను సరే శ్రీమద్భాగవత సేవనము శ్రవణము చేసియే తీరవలెననుట. కేవలము శ్రీకృష్ణలీలా శ్రవణమే, కీర్తనమే రసాస్వాదన కయి యాసక్తులయి మోక్షమును గూడఁ ద్రోసిరాజనువారికి శ్రీమద్భాగవతమే ధనము. సంసారదుఃఖములతో విసిగి వేసారి చీకాకుచెంది, ముక్తి నాసించెడి నార్తుల భవరోగమున కిదియే దివ్యౌషధము కావునఁ గలికాలమున దీనిని ప్రయత్నపూర్వకముగా సేవనము చేయవలెను. వీరుగాక, విషయభోగపరాయణులయి, సంసార సుఖములనే సదా వాంఛచేయు వారికిని కలికాలమున, సామర్థ్యము, ధనము, విధివిధానజ్ఞానములేని కారణమునఁ గర్మ మార్గమున, ననఁగా యజ్ఞాదులొనర్చి సిద్ధిపడయుట యత్యంత దుర్లభమయి యుండును. ఇట్టి దశయందు వారును సర్వప్రకారముల నీ భాగవతకథనే సేవింపవలయును. శ్రీమద్భాగవతకథ, ధన, తనుజ, వనితాదులను, కరితురగశకటాది వాహన సమృద్ధినిఁ గృహారామక్షేత్రాది సంపదలను, నిష్క ంటక రాజ్యమును నొసఁగఁగలదు. సకామభావమున శ్రీమద్భాగవతము నాశ్రయించు మానవు లీ లోకమున మనోవాంఛితములగు నుత్తమ భోగముల ననుభవించి, యంతమున శ్రీమద్భాగవత సంగముచేతనే శ్రీహరి పరమధామమును బ్రాపించెదరు.

శ్రీమద్భాగవత కథావార్తాదులు జరగుచోటనుండు వారికిని శ్రీమద్భాగవత కథాశ్రవణ మొనించుచుండు వారికిని, తమతమ ధనములతో సేవయు సహాయము చేయవలెను. వారి యనుగ్రహముచే, సహాయ మొనరించు వారికిని, శ్రీమద్భాగవతమున సేవించిన పుణ్యము లభించును. కోరిక రెండు వస్తువులకొఱకై సేవించిన పుణ్యము లభించును. కోరిక రెండు వస్తువులకొఱకై యుండును. (1) శ్రీకృష్ణునికొఱకు (2) ధనముకొఱకు. శ్రీకృష్ణునిఁగాక మఱేదికోరినను; నది యంతయు ధనమం దంతర్గతమయినదే. దానికి 'ధన' మని సంజ్ఞ. శ్రోత, వక్త అనువారును రెండు ప్రకారములుగా నుందురు. ఒకరు శ్రీకృష్ణుని కోరువారు. ఒకరు ధన మాశించు వారు. అని వక్త యెట్టివాడో శ్రోతయు నట్టివాఁ డయ్యేనేని, కథయందు రసము లభించును. అందువలన సుఖవృద్ధి యగును. ఇరువురు విపరీత విచారము కలవారయిరేని రసాభాసమగును. ఆ కారణమున ఫలహాని యేర్పడును. కాని శ్రీకృష్ణునే యాశించువారు వక్తయు శ్రోతయు నయియుండి రేని, విలంబమయినను సిద్ధి యవశ్యము లభించితీరును, కాని ధనార్థులకో, యనుష్ఠానము విధివిధాన మునం దెట్టిలోపము లేక సాంతమయి ననే సిద్ధి కలుగును. శ్రీకృష్ణునియం దభిలాష కలవారు సర్వవిధముల గుణహీనులయినను, విధివిధానమున లోపములుండినను, వారి హృదయమునఁ బ్రేమయున్నచోఁ జాలు నదియే సర్వోత్తమ విధి. సకామపురుషులకు కథ సమాప్తియగు వరకు సావధానముగ సమస్త నియమములను విధులను తూ చా తప్పకుండ జరిపితీర వలెను. భాగవతకథ వినువారు, చెప్పువారు తప్పక పాటింపవలసిన విధియిది. ప్రతిదినము ప్రాతఃకాలమున స్నానముచేసి నిత్యకృత్యములను బూర్తిచేసికొనవలెను. తర్వాత భగవచ్చరణామృతమును ద్రావి, పూజాసామగ్రు లతో శ్రీమద్భాగవతకోశమును, గురుదేవుని (వ్యాసుని) బూజింపవలెను. అటు పిమ్మట, మిగుల సంతోషముతో శ్రీమద్భాగవతకథను స్వయముగా జెప్పవలెను లేదా వినవలెను. పాలుగాని, పాయసముగాని మౌనముతో భుజింపవలెను. నిత్యము బ్రహ్మచర్యవ్రతము నడపవలెను. నేలపయిఁ బరుండవలెను. క్రోధము, లోభము మున్నగువానిని దృజింపవలెను. ప్రతిదినము కథ సమాప్తమైన పిమ్మటఁ గీర్తనము చేయవలెను. రాత్రులందు జాగరణ మొనరింపవలెను. సమాప్తియయిన మీఁదట బ్రాహ్మణులకుఁ దృప్తిగా భోజనముపెట్టి, దక్షిణ లొసఁగి సంతోషపెట్టవలెను. కథను వినిపించిన యాచార్యునకు వస్త్రములను భూషణముల నొసఁగి గోవు నర్పింపవలెను. ఈ ప్రకారము విధివిధానము పూర్ణమయిన పిమ్మట, మనుష్యుఁడు, స్త్రీ, ధన, గృహ, పుత్ర, రాజ్య, ధనాది సమస్త మనోవాంఛితములను గోరినవిధముగాఁ బడయఁగలఁడు. కాని సకామభావమును విడంబన మధికము. శ్రీమద్భాగవతకథ కది శోభ నొసఁగజాలదు. శ్రీశుకదేవుని శ్రీముఖమునుండి చెప్పఁబడిన ఈ శ్రీమద్భాగవత శాస్త్రము, కలియుగమున సాక్షాత్ శ్రీకృష్ణప్రాప్తి నొసఁగునట్టిదియు, నిత్యప్రేమానందప్రదానము చేయునట్టిదియు గావున, దీనిని దుచ్ఛకామములకయి యుపయోగించుట యుచితముగాదు.

**శ్రీకృష్ణార్పణమస్తు**

## శ్రీమద్భాగవత సప్తాహము

శ్రీమద్భాగవత సప్తాహవిధి శ్రీమద్భాగవత మాహాత్మ్యమున వర్ణింపఁబడియున్నది. ఇందుఁ బ్రతిదిన మెంతవఱకు చదువవలెనో అది మాత్రము తెలియఁజేయఁబడును. కైశిక సంహితాంతర్గత భాగవతమాహాత్మ్య మునందు శ్రీసూతుఁడు శౌనకాదిమునిపుంగవులతో నిట్లు చెప్పెను. మొదటి దినమున మను కర్దమసంవాదము వఱకు, రెండవనాఁడు ఋషభాఖ్యాన పర్యంతము, మూఁడవనాఁడు సప్తమస్కంధ సమాప్తి వఱకు, నాల్గవదినమున శ్రీకృష్ణజన్మ పర్యంతము, అయిదవ దినమున రుక్మిణీకల్యాణము వఱకు, ఆఱవనాఁడు హంసగీతవఱకు, ఏడవ దినమున శ్రీమద్భాగవతము సమాప్తి. పదునెనిమిదిదినములు చదువునెడల ప్రతిదినము వెయ్యి శ్లోక ములు చదువవలెను, మాసపాఠ మయినచో ప్రతిదినము 11 అధ్యాయములు. చివరనాఁ డయిదధ్యాయము లధికముగాఁ చదివి ముగింపవలెను. ఇరువదొకదిన పారాయణ మయినచో నిరువది దినములవఱకు ప్రతిదినము 16 అధ్యాయముల వంతున 21 వ దినమున పదునైదధ్యాయములు చదువవలెను. పదునైదు దినము లనుష్ఠానమయినచో, ప్రతిదినము 22 అధ్యాయములు చివరదినమున 27 అధ్యాయములు చదివి ముగింప వలెను.

ఇఁక శ్రీమద్భాగవతమునకు ఋషి, ఛందస్సు, మున్నగు వానిని వ్రాసెదను. పాఠమున వీనిని నుపయో గము చేయవలెను. పారాయణము ప్రారంభము చేయుటకు ముందు నూటెన్మిది సార్లు **'ఓం నమోభగవతే వాసుదేవాయ'** యను ద్వాదశాక్షర మంత్రమును గాని లేదా **'ఓం క్లీం కృష్ణాయ, గోవిందాయ, గోపీజనవల్ల భాయ స్వాహా'** యను గోపాల మంత్రమును గాని జపము చేయవలెను. ఆ పిమ్మట నిట్లు వినియోగము చేయవలెను.

**"ఓం అస్యశ్రీమద్భాగవతాఖ్య స్తోత్రమంత్రస్య, నారద ఋషిః, బృహతీఛందః శ్రీకృష్ణః పరమాత్మాదేవతా, బ్రహ్మబీజమ్, భక్తిః శక్తిః, జ్ఞానవైరాగ్యే కీలకం, మమ శ్రీమద్భాగవత్ప్రసాద సిద్ధ్యర్థంపాఠే వినియోగః."**

వీనికి న్యాసముకూడఁ జేయవలెను. శిరమున ఋషిని, ముఖమున ఛందస్సును, హృదయమున దేవతను, గుహ్యమున బీజమును, పాదముల శక్తిని, నాభియందు న్యాసము చేయవలెను. ద్వాదశాక్షర మంత్రము చేత గరన్యాసము, అంగన్యాసము, చేయవలెను. అథవా.

**ఓంక్లీం హృదయాయనమః, ఓం క్లీం శిరసేస్వాహా,క్లూం శిఖాయైవషట్, క్లైం కవచాయహుమ్, క్లౌం నేత్రత్రయా వౌషట్, క్లః అస్త్రాయఫట్.** కరన్యాసక్రమమున నిటువలెనె. ఈ క్రిందిశ్లోకముల ననుసరించి ధ్యానము చేయవలెను.

**కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।**
**సర్వాంగే హరి చందనం సులలితం కంఠేచ ముక్తావలీ**
**గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥**
**అస్తి స్వస్తరుణీకర్ణా విగలత్క ల్ప ప్రసూనాప్లుతం ।**
**వస్తుప్రస్తుత వేణునాదలహరీ నిర్వాణ నిర్వ్యాకులమ్ ।**
**స్రస్తస్రస్తనిబద్ధ నీవి విలసద్గోపీ సహస్రావృతం ।**
**హస్తన్యస్త నతావవర్గ మఖిలోదారం కిశోరాకృతిమ్ ॥**

తరువాత శ్రీమద్భాగవము పఠించవలెను. ప్రతిశ్లోకమునకు ప్రణవము లేక ద్వాదశాక్షర మంత్రమును సంపుటి చేసి పారాయణము చేయవచ్చును. లేకుండను జేయవచ్చును. ఏప్రకారముగనైన శ్రీమద్భాగవతమును బారము చేయవలెను. ఈ యుగమున నిదియే సర్వోత్తమమయిన సాధనము. భగవత్కృపచే లభించినది.

### శ్రీమద్భాగవతానుష్ఠానవిధి

### భాగవత మహిమ

**శ్లోకార్థం శ్లోకపాదం వా నిత్యం భాగవతం పఠేత్ ।**
**యః పుమాన్ సోఽపి సంసాన్ముచ్యతే కిముతాఖిలాత్ ॥**

శ్లోకములో నర్ధముగాని పాదముగాని నిత్యము శ్రీమద్భాగవతమును బఠించువాఁడు సంసారమునుండి ముక్తుండగును. ఇఁక సంపూర్ణపాఠ మొనరించువారి విషయము చెప్పనేల?

